# మనవి

గ్రేట్ ఆంధ్రా డాట్‌కామ్‌లో నేను "ఎమ్బీయస్ కబుర్లు" అనే శీర్షిక నిర్వహిస్తూ వుంటాను. నా ఆర్టికల్స్ తాలూకు ఆర్కయివ్స్ వెతుక్కోవడం కాస్త కష్టమైన పనే !

అందువలన నేను వాటిని గ్రేట్ ఆంధ్రా డాట్‌కామ్ సౌజన్యంతో ఈ-బుక్స్‌గా అందించబోతున్నాను. ఇవి పిడియఫ్ ఫార్మాట్‌లో ఈ బుక్స్‌లో లభిస్తాయి. పిడిఎఫ్ కాబట్టి ప్రింటవుట్ తీసుకోవడం కూడా సులభం.

ఈ పుస్తకంలో నేను నిర్వహించిన "సినీమూలం" శీర్షికలోని 7 సినిమాల గురించిన వ్యాసాలివి. ఇది మొదటి భాగం. ఎంతవరకు మీకు నచ్చిందో తెలియబరచండి. తక్కినవి కూడా అందుబాటులోకి తెస్తాను.

భవదీయుడు

**ఎమ్బీయస్ ప్రసాద్**

mbsprasad@gmail.com

*జనవరి 01, 2012*

# సినీమూలానికి మూలం

ప్రముఖ రచయిత్రి ఓల్గాగారు "వనితా టీవీ"కి రూపకల్పన చేస్తూ నన్ను సినిమా కార్యక్రమం ఏదైనా నిర్వహించమన్నారు. రచన, వాయిస్ఓవర్, యాంకరింగ్ నాదే నన్నారు. నేను మాత్రమే చేయగల కార్యక్రమం గురించి ఆలోచించమన్నారు.

మన సినిమారంగంలో అన్నీ వున్నాయి, అందరూ వున్నారు. స్టూడియోలు, సెట్టింగులు, కెమెరాలు, కాస్ట్యూములు, రికార్డింగ్ థియేటర్లు, ఆర్కెస్ట్రాలు, మైకులు, సింథసైజర్లు - యిలా అన్నీ వున్నాయి. అలాగే - తారలు, కొసరు తారలు, పాత్రధారులు, గాత్రధారులు, డైరక్టర్లు, డాన్సు డైరక్టర్లు, స్టంటు డైరక్టర్లు - యిలా అందరూ వున్నారు. వీళ్లందరినీ అమర్చడానికి బస్తాల కొద్దీ డబ్బుంది. డబ్బుంటే ఏది కావాలంటే అది వుంది వున్నట్టే. దేని గురించి వెతుక్కోనక్కరలేదు. అయితే అంధరూ నిరంతరం వెతికేది ఒక్కటే - **కథ!**

హీరో కానీయండి, హీరోయిన్ కానీయండి, డైరక్టర్ కానీయండి, ప్రొడ్యూసర్ కానీయండి - ఇంటర్వ్యూలో అందరూ చెప్పేది ఒకటే! 'మంచి కథ గురించి చూస్తున్నామండి. దొరకగానే మా తరువాతి సినిమా మొదలెట్టేస్తాం.'

కథల గురించి అన్వేషణ యీనాటిది కాదు, సినిమా పుట్టినప్పటినుండీ వుంది. మరి పాతతరం వాళ్లు యీ సమస్యను ఎలా ఎదుర్కొన్నారు? ఎలా అంటే కాస్త అటూ, యిటూ చూడడం ద్వారా! అంటే మన తెలుగు సంస్కృతికి నప్పే హిందీ, ఇంగ్లీషు, బెంగాలీ, తమిళం, మరాఠీ సినిమాలను, నవలలను వాళ్లు నిరంతరం పరిశీలించేవారు. ఇక్కడ 'నప్పే' అనేది కీ వర్డ్. అండర్ లైన్ చేయవలసిన ముఖ్యమైన మాట. అన్నీ మనకు నప్పవ్. నప్పించడంలోనే వుంది వారి గొప్ప! అనగా - మూలకథను తీసుకుని దానికి మనకు కావలసిన రంగులద్ది, ఇది మన వాకిట్లోనే, మన పక్కింట్లోనే జరిగిన కథేమో అనిపించేలా తీయగలగాలి.

'అ విధంగా తీసిన మహానుభావులను స్మరిస్తూ, వారికి అంజలి ఘటిస్తూ, కొన్ని తెలుగు సినిమాల మూలాలు వెతుకుదాం. డైరక్టుగా కాపీ కొట్టేసిన సందర్భాలను

వదిలేసి వేరే చోట నుండి తీసుకుని దాన్ని యింప్రొవైజ్ చేసిన కేసులనే పరామర్శిద్దాం. అప్పుడే మనవాళ్ల ఘనత ప్రస్తావనకు వస్తుంది.' అని కాన్సెప్ట్ చెప్పాను. ఆవిడకు నచ్చింది.

ఇతర భాషలతో నాకున్న పరిచయం, ఇతర భాషాచిత్రాలపై నాకున్న ఆసక్తి కారణంగా "ఇదీ అసలు కథ" అనే కార్యక్రమాన్ని తలపెట్టాను. ఆవిడ ప్రోత్సహించారు. కార్యక్రమానికి కొంతకాలం నిర్మాతగా వ్యవహరించిన శ్రీ మూర్తిగారు, ఎక్కువకాలం నిర్మాతగా వున్న శ్రీ నందగిరి కృష్ణగారు చాలా మంచి సహకారం అందించారు. వారందరికీ నా కృతజ్ఞతలు. దాదాపు 60 కార్యక్రమాలు ఏడాదిన్నర పాటు నడిచాయి.

కార్యక్రమం ప్రేక్షకులకు నచ్చింది. అంతేకాదు, 2009 టీవీ నందీ ఎవార్డులలో రజిత నంది గెలుచుకుంది. ఇటువంటి కార్యక్రమం భారతదేశంలో మరే టీవీలోనూ చేయటం లేదని తెలిసింది.

"వనితా టీవీ" ప్రాచుర్యం తక్కువ కాబట్టి, అన్ని చోట్లా రాదు కాబట్టి యూ ట్యూబ్‌లో పెట్టమని కొందరు కోరారు. "ఇదీ అసలు కథ" పేరుతో కొన్ని పెట్టడం జరిగింది. దాన్ని వచనరూపంలో అందించమని మరి కొందరు కోరడంతో గ్రేట్ ఆంధ్రాలో "సినీమూలం" పేరుతో శీర్షికగా నడుపుతున్నాను. దానిలో 7 సినిమాల పరిచయం యీ పుస్తకం ద్వారా అందిస్తున్నాను. తక్కిన సినిమాల పరిచయం తక్కిన భాగాలలో వస్తుంది.

ఎమ్బీయస్ ప్రసాద్

## విషయసూచిక

## దేవదాసు

మన తెలుగు సినీరంగంలో బెంగాలీ నవలల నుండి అనేక సినిమాలు తయారయ్యాయి. వాటిలో ప్రముఖంగా చెప్పుకోదగ్గది - దేవదాసు. అయితే అరువు తెచ్చుకున్న ఆ నవలను అలాగే దించేయకుండా ఎంత గొప్పగా యింప్రొవైజ్ చేశారో యిప్పుడు ఈ శీర్షికలో చెప్పుకుందాం.

దేవదాసు రాసినది శరత్‌బాబు. పూర్తి పేరు శరత్ చంద్ర చటోపాధ్యాయ్. ఈ నవల అనే కాదు, శరత్‌బాబు నవలలన్నీ బెంగాలీలోనే కాదు, భారతీయ భాషలన్నిటిలోనూ ప్రఖ్యాతి గాంచాయి. శరత్ నవలల ఆధారంగా చాలా సినిమాలు వచ్చాయి. మరీ ముఖ్యంగా యీ దేవదాసు బెంగాలీ, హిందీ భాషల్లో అనేకసార్లు తీశారు. తెలుగులో తొలిసారి 1953లో వచ్చింది. సినిమా తెలుగు సినిమా చరిత్రలోనే ఓ మైలురాయిగా నిల్చిపోయింది. భగ్నప్రేమికుడికి, తాగుబోతుకి దేవదాసు అనే పేరు పర్యాయపదం అయిపోయింది. 1953లో తొలిసారి రిలీజైనప్పుడే కాదు, పాతికేళ్ల తర్వాత రిలీజైనా అప్పటికే కలర్ యుగం వచ్చేసినా, యీ సినిమా వందరోజులాడింది. ఇంత గొప్ప సినిమా తయారవడానికి ముడిసరుకు బెంగాలీ నవలే అయినా దాన్ని మనకు



అనువుగా మలచుకోవడంలోనే వుంది మన తెలుగువారి ప్రతిభ




దేవదాసు సినిమా బాగా పాప్యులర్. అందరికీ తెలుసు. స్థూలంగా కథ చెప్పుకుపోతూ, నవలలో లేని ఘట్టాల గురించి కాస్త వివరంగా చెప్తాను. దీనితో బాటు పోలికకోసం బెంగాలీ దేవదాసు ఒక వెర్షన్ గురించి చెప్తాను. ఇదెందుకంటే దేవదాసు బెంగాలీ వాతావరణంలో కథే కదా! పైగా నేను ప్రస్తావించే వెర్షన్ మన సినిమా తీసిన పాతికేళ్ల తర్వాత – అదీ కలర్‌లో – తీసినది.

దీనిలో బెంగాలీ చిత్రసీమకు చెందిన హేమాహేమీలు – ఉత్తమ్ కుమార్, సౌమిత్రో చటర్జీ, సుప్రియా దేవి, సుమిత్రా ముఖర్జీ – నటించారు. దిలీప్ రాయ్ దర్శకత్వం. వాళ్లూ కాస్త కాస్త మార్పులు చేశారు కానీ మనకంటె నవలకు కొంత దగ్గరగా వెళ్లారు. ముందుగా మన సినిమా సంగతి చూద్దాం.

సినిమా యిద్దరు చిన్నపిల్లలతో ప్రారంభమౌతుంది. వారిలో మగపిల్లవాడు దేవదాసు – ఆ వూరి జమీందారు నారాయణరావు (యస్వీ రంగారావు) కొడుకు. ఆనాటి జమీందారు పిల్లల లాగానే అల్లరి, మకురుతనం, దుందుడుకుతనం మూర్తీభవించిన కుర్రాడు. ఇంకో చిన్నపిల్ల పేరు పార్వతి. వాళ్ల యింటిపక్కనే వుంటుంది. గడుసుపిల్ల, కొంటె పిల్ల. ఇతనంటే వల్లమాలిన యిష్టం.




ఈ దేవదాసు పార్వతిమీద అధికారం చలాయిస్తూ వుంటాడు. ఆమె యిష్టంగా

దాన్ని భరిస్తూ వుంటుంది. ఇతనికి చదువు అబ్బటం లేదు. మాస్టార్ని ఏడిపించడం, బడికి వెళ్లకపోవడం, జమీందారు కొడుకు కదాని టీచర్లు భరించడం.

కొంతకాలానికి భరించలేక టీచరు జమీందారుకి ఫిర్యాదు చేశాడు. ఇతను యీ వూళ్లోనే వుంటేనే చెడిపోతాడని పట్నం పంపించి పెద్ద స్కూల్లో వేశారు. అక్కడ పెద్దవాడై చదువుసంధ్యలు నేర్చి పట్నానికి తిరిగి వచ్చాడు. పట్నంలో అక్కడ అతని క్లాసుమేటు భగవాన్ (పేకేటి). అతను జులాయి మనిషి. అప్పులు చేసి జల్సా చేస్తూంటాడు. ఒరిజినల్ నవలలో ఈ కారెక్టరు పేరు చునీలాల్.

అతను దేవదాసుకి క్లాసుమేటు కాదు. ఓ మెస్‌లో అతని పక్కన రూములో వుంటాడు. ఇంకా కొన్నాళ్లు పోయాక పరిచయమౌతాడు. దేవదాసు (అక్కినేని) పల్లెకు తిరిగి వస్తూంటే 'పల్లెకు పోదాం పారును చూదాం చలో చలో' అనే పాట పెట్టారు. మధ్యలో "...మనసేమో, మక్కువేమో, అదేమో...' అని వస్తుంది చూడండి. ఇక్కడ దేవదాసు పాత్ర స్వభావం గమనించాలి. యవ్వనంలోకి వచ్చాక తనకు పార్వతీమీద ప్రేమ వుందని గ్రహించాడు. అందుకే మనసేమో, మక్కువేమో అన్నాడు.

నవలకు, తెలుగు సినిమాకు ప్రధానంగా తేడా యిదే! నవలలో దేవదాసు కారెక్టర్‌లో అజ్ఞానం వుంది. పార్వతికి తనపై ప్రేమ వుందని నవలలో దేవదాసుకి తెలియదు. ఆ కన్‌ఫ్యూజనే నవలకు ఆయువుపట్టు. అది స్నేహమో, ప్రేమో తెలియక, దానికై ఎంతదూరం వెళ్లాలో తేల్చుకోలేక, జీవితం చిందరవందర చేసుకుంటాడు.

కానీ సినిమాలో దేవదాసుకి పార్వతిని తను ప్రేమిస్తున్నానని తెలుసు. కానీ పరిస్థితుల ప్రభావం వలన చేసుకోలేక పోతాడు. ఇది చాలా ప్రధానమైన మార్పు. దీనివలన నవలాకారుడు తీర్చిన పాత్ర స్వభావం దెబ్బతిందేమో కానీ ప్రేక్షకుల హృదయాల్లో సినిమా నాటుకుపోయింది. అక్షరాస్యుడైన పాఠకుడు వేరు, నిరక్షరాస్యుడైన ప్రేక్షకుడు వేరు. సమస్యను సటిల్‌గా చూపిస్తే సగటు ప్రేక్షకుడికి అందకపోవచ్చునన్న శంకతో తెలుగు సినిమా వారు మార్పులు చేశారు.



చిన్నపిల్లలుగా ఆడుకోవడం వేరు, కౌమారప్రాయం వచ్చాక ఎక్కడలేని సంకోచాలు వచ్చిపడతాయి. నవలలో దేవదాసు బస్తీ నుండి వచ్చాక ఓ పట్టాన పార్వతిని కలవడు. కానీ తెలుగు సినిమాలో

సరాసరి వీళ్ల యింటికే వచ్చేస్తాడు. పైగా వీళ్ల ప్రేమ విఫలం అవుతుందని సూచించడానికి పార్వతి దేవదాసుకి పెట్టబోయిన దేవుడి ప్రసాదం కింద పడిపోయినట్టు చూపించారు మనవాళ్లు.

ఆ తర్వాత వాళ్ల మధ్య ఓ డ్యూయట్ పెట్టారు. చిన్నప్పుడు పాడిన 'ఓ దేవదా..' పాటను మరో వెర్షన్‌లో చూపించారు. ఈ పాటలో గమనించండి – దేవదాసు పార్వతిని ఉద్దేశించి 'జాణ అయిందే' అంటాడు. 'అలనాటి కలలన్నీ..' అంటాడు. అక్కడ సినిమా హీరో నవలలోని హీరో కంటె తెలివిమీరి ప్రవర్తించాడు. ఇక్కడ దేవదాసు పార్వతికోసం ఓ నెక్లెసు యిచ్చినట్టు మనవాళ్లు కల్పించారు. సినిమా చివర్లో దేవదాసు చనిపోయినప్పుడు సింబాలిక్‌గా ఈ నెక్లెసు పార్వతి భర్త చెప్పుల కింద పడి ముక్కలైపోతుంది. ఇది నవల్లో లేదు.

పార్వతి నాయనమ్మ దేవదాసుకు పార్వతిని చేసుకోమని దేవదాసు తల్లిని అడిగింది. ఆమెకు  యీ సంబంధం యిష్టం లేదు. ఎందుకంటే పార్వతి వంశంలో కన్యాశుల్కం ఆచారం వుంది. ఆడపిల్లల్ని అమ్ముకునే వంశంనుండి పిల్లను తెచ్చుకోవడమా? అని ఆవిడ అభ్యంతరం.

భర్త దగ్గర ప్రస్తావించి చూస్తే ఆయనా మండిపడ్డాడు. బెంగాలీ సినిమాలో కాస్త మార్పు చేశారు. తల్లి దేవదాసు పట్ల సాఫ్ట్ కార్నర్ చూపిస్తుంది కానీ తండ్రి ఒప్పుకోడు. అతను పార్వతి తండ్రిని పిలిచి కావాలంటే పార్వతికి డబ్బు యిస్తాను వేరే చోట సంబంధం చూడు అంటాడు. తెలుగులో అయితే మరీ అన్యాయం. తిట్టిపోస్తాడు. అంతస్తు భేదాల గురించి మాట్లాడతాడు.

ఇదేమీ నవలలో లేదు. తల్లి వెళ్లి యిలా అడిగిందని తెలియగానే పార్వతి తండ్రి మండిపడి సంబంధాలు వెతకబోయాడు. కొంపమునుగుతోందని గ్రహించి పార్వతి దేవదాసు గదికి ఓ నాడు రాత్రివేళ వెళ్లి నన్ను పెళ్లి చేసుకోమని అడిగేసింది. పార్వతి మనసులో ఏ పాటి కన్‌ఫ్యూజనూ లేదు. తను దేవదాసును ప్రేమిస్తున్నానని తెలుసు ఆ పిల్లకు. ఉన్నదంతా గందరగోళమంతా దేవదాసులోనే! తన మనసు తాను తెలుసుకోలేక, సరైన సమయంలో సరైన నిర్ణయం తీసుకోలేక దేవదాసు ముగ్గురి జీవితాలను నాశనం చేశాడు. ఆ రాత్రి పార్వతి దేవదాసు వద్దకు వస్తే అతను కంగారు పడిపోయాడు – ఎవరైనా చూస్తారేమోనని. ఆమె నీ పాదాల దగ్గర చోటు యిస్తే కళంకం ఏమీ వుండదంది.

దేవదాసు బేలగా నేను తప్ప నీకు గత్యంతరం లేదా? అని అడిగాడు. మా అమ్మకీ



నాన్నకీ యిష్టం లేదు అని కూడా చెప్పేశాడు. పార్వతి అవేమీ నాకు తెలియదు అంది. అమ్మకీ నాన్నకీ ఎదురు తిరగమంటావా? అని అడిగాడు. తిరుగు అందామె. తెల్లవారేదాకా ఆమె అక్కడే కూర్చుంది. ఇతను ఆమెను పంపించివేశాడు. దీన్ని తెలుగు సినిమాలోనూ, బెంగాలీ సినిమాలోనూ యథాతథంగా చూపించారు.

మర్నాడు దేవదాసు తండ్రితో మాట్లాడిన ఘట్టం నవలలో, బెంగాలీ సినిమాలో ఒకేలా వుంటుంది. పార్వతి ప్రస్తావన తేగానే తండ్రి చిన్నప్పటినుండి వేధిస్తూ వచ్చావ్ అని విసుక్కున్నాడు. తల్లి ఏడుస్తూ 'నాయనా యిది కూడా రాసిపెట్టి వుందా మాకు!' అంది. దేవదాసు ఏమీ మాట్లాడలేక ఆ రోజే పెట్టే, బేడా తీసుకుని కలకత్తా వెళ్లిపోయాడు. బెంగాలీ వెర్షన్‌లో దేవదాసుగా వేసినది బెంగాలీలో మేటి హీరో సౌమిత్రో చటర్జీ.

ఈ ఘట్టం యిలాగే పెడితే హీరోను తన్నబుద్ధేస్తుంది. అందువలన తెలుగులో మార్చేశారు. నాగేశ్వరరావు ఎస్వీ రంగారావు వద్దకు వచ్చి పార్వతిని చేసుకుంటానని పట్టుబడతాడు. రంగారావు వంశమర్యాద గురించి మాట్లాడి, తుపాకీ తీసి కావాలంటే నన్ను కాల్చి నీ యిష్టం చెల్లించుకో అంటాడు. తండ్రికి, ప్రేమకు మధ్య నలిగిన దేవదాసు వంశగౌరవానికి తలవొగ్గుతాడు. ఈ డ్రామా వలన హీరో మీద, అతని నిస్సహాయతమీద తెలుగు ప్రేక్షకుడికి జాలి కలిగింది.



బస్తీకి వచ్చి దేవదాసు పార్వతికి ఉత్తరం రాసి వదేశాడు. మా





**తెలుగు దేవదాసులో ఎయన్నార్, పేకేటి**
**బెంగాలీ దేవదాసులో**
**సౌమిత్రో చటర్జీ, ఉత్తమ్ కుమార్**

అమ్మానాన్నా ఒప్పుకోలేదు కాబట్టి నన్ను మన్నించి వేరే చోట పెళ్లి చేసుకో అని. దీనికి ప్రోద్బలం అతనికి మెస్‌లో పరిచయమైన చునీలాల్! బెంగాలీ వెర్షన్‌లో చునీలాల్ పాత్ర ధరించినది సౌమిత్రో కంటె పాప్యులర్ నటుడు ఉత్తమ్ కుమార్. ఈ సినిమాలో పాటలన్నీ అతనికే పెట్టారు.

ఇతని స్వభావం నవలలోనూ, బెంగాలీ వెర్షన్‌లోనూ త్రూ ఔట్ ఒకేలా రికామీగా వుంటుంది. కానీ తెలుగులో ఈ పాత్ర పేరును భగవాన్‌గా మార్చి ఎన్నో షేడ్స్ పెట్టారు. చివర్లో అతని మీద కూడా జాలి కలిగేట్టు చేశారు. ఆ పాత్ర వేసినది పేకేటి శివరాం. తెలుగు సినిమా దేవదాసుకి అతను యిచ్చిన సలహాను మార్చిపారేశారు. అతను మన కిష్టమైనవాళ్ల కోసం అమ్మా, నాన్నా, దేవుడూ ఎవరినైనా ఎదిరించవచ్చు అని చెప్తాడు. నవలలో అతనిలా ఏమీ చెప్పడు. బెంగాలీ వెర్షన్‌లోనూ చెప్పడు. బాధపడకు, ఎంజాయ్ చేయ్ అంటాడంతే.

భగవాన్ సలహా వలన తెలుగు సినిమా దేవదాసుకి ధైర్యం వచ్చింది. పార్వతిని చేపడదామని ఊరికి వచ్చేశాడు. అలా వచ్చేముందు ఓ చిన్న సంఘటన జరిగింది.

సుఖం ఎక్కడుందో చూపించమని దేవదాసు ఛాలెంజ్ చేస్తే భగవాన్ చంద్రముఖి (పాత్రధారిణి లలిత) అనే ఓ వేశ్య వద్దకు తీసుకెళ్లబోతాడు. ఆమె యితని గురించి తయారై రెడీ అవుతుంది కానీ యింతలో దేవదాసు ఊరికి వెళ్లిపోవడంతో ఆమె నిరుత్సాహపడుతుంది. ఈమె తర్వాత దేవదాసు జీవితంలో ఓ ముఖ్యభూమిక వహిస్తుంది.

దేవదాసు ఊరికి వచ్చి పార్వతిని కలవబోయాడు కానీ యింతలోనే ఆమె తండ్రి వెళ్లి ఓ ముసలి జమీందారు సంబంధం కుదుర్చుకుని వచ్చాడు. తల్లీ భార్యా కాస్సేపు గునిశారు కానీ అతని వద్దనుండి రెండుమూడు వేల రూపాయలు వస్తాయని తెలియగానే వూరుకున్నారు అని శరత్‌బాబు రాశాడు.

బెంగాలీ సినిమాలోనూ అంతే. తెలుగు సినిమాలో మాత్రం ఆడవాళ్లు తిరగబడతారు. 'మాట యిచ్చివచ్చేశా ఎలా' అని తండ్రి అంటే అప్పటికే దేవదాసు ఉత్తరం చదివి కుతకుతలాడుతున్న పార్వతి 'నీ గౌరవమే నా గౌరవం నాన్నా' అని ముందుకు వచ్చింది. దీనివలన తెలుగు సినిమావాళ్లు నాటకీయత పెంచడంతో బాటు పార్వతి కారెక్టరుతో యితర స్త్రీ పాత్రలనూ ఎలివేట్ చేశారు.

ఇప్పుడే పార్వతి ఆ పెళ్లికి సరేనన్న ఉత్తరక్షణంలోనే, అత్యంత డ్రమెటిక్‌గా దేవదాసు వీళ్లింటికి వచ్చినట్టు, పార్వతి పెళ్లి వార్త విని హతాశుడైనట్లు తెలుగుసినిమావారు కల్పించారు. నవలలో అతను వీళ్లింటికి రానే రాడు. వెళ్లి చెరువుగట్టున కూర్చుని చేపలు పడుతూ వుంటాడు. అంత పిరికివాడతను. బెంగాలీ సినిమాలో కూడా అంతే. పార్వతి మధ్యాహ్నం నీళ్లకోసం వచ్చినపుడు వాళ్లిద్దరి జరిగిన సంభాషణను బెంగాలీవాళ్లు, తెలుగువాళ్లు నవలలోనిదే తీసుకున్నారు.



దేవదాసు పార్వతికి ఆఫర్ చేస్తాడు 'నేను అప్పుడు తెలుసుకోలేకపోయాను. ఇప్పుడు మా తలిదండ్రులను ఒప్పిస్తాను, నిన్ను పెళ్లాడతాను' అని. పార్వతికి అప్పటికే అహం దెబ్బతిని వుంది కాబట్టి 'నాకూ తలిదండ్రులున్నారు. వాళ్లకు నీకిచ్చి చేయడం యిష్టం లేదు' అంటుంది.

వాదోపవాదాలలో పార్వతి 'నన్ను పెళ్లాడబోయేవారు ధనవంతులు, బుద్ధిమంతులు. నీలా అజ్ఞాని, చంచలచిత్తుడు, పోకిరీ కాదు. నీకు రూపం వుంది కానీ గుణం లేదు. నాకు రూపమూ గుణమూ రెండూ వున్నాయి. ఆ రోజు రాత్రి నీ గదికి వచ్చి బతిమాలానని నాకు హాని చేద్దామనుకుంటున్నావేమో, కావాలంటే నామీద అపవాదు వేసి తృప్తిపడు" అనేసింది.

ఇక్కడ దేవదాసు అపరిపక్వత, అసహనం కనబడతాయి. "ఇదంతా అహంకారంతో మాట్లాడుతున్నావ్. దీనికి కారణం నీ అందం. చూడు నీ మొహానికి కళంకం తెస్తాను" అంటూ గాలంకర్రతో (తెలుగు సినిమాలో చేతికర్రతో) ఆమె మొహం మీద గాయం చేస్తాడు. తర్వాత నవలలో లాగే తన అంగీ చింపి, దానికి కట్టు కడతాడు.

బెంగాలీ సినిమాలో గాలంకర్రతోనే గాయం చేస్తాడు కానీ కట్టు కట్టనే కట్టడు అన్యాయంగా. ఇక్కడ దేవదాసు కొట్టిన దెబ్బకివడిన మచ్చకు నవలలో ప్రాముఖ్యత లేదు. కానీ తెలుగు సినిమాలో మాత్రం ఓ





**దేవదాసు పార్వతిని గాయపరిచే ఘట్టంలో బెంగాలీ సినిమాలో దేవదాసు, పారులుగా సౌమిత్రో చటర్జీ, సుమిత్రా ముఖర్జీ 2. అదే ఘట్టంలో తెలుగులో ఎయన్నార్, సావిత్రి**

సందర్భంలో ఆమె భర్త అది చూపించి అందమైన మొహానికి మచ్చపెట్టినందుకు దేవుణ్ని నిందిస్తాడు. ఆ దేవుడు దేవదాసే నని ప్రేక్షకుడికి తెలుసు.

నవలలో ఆ రాత్రే దేవదాసు పట్నం వెళ్లిపోతాడు. కానీ తెలుగు సినిమాలో మాత్రం పెళ్లయి ఆమె మేనా వెళుతూంటే యితను దీనంగా చూస్తూండడం, నేపథ్యంలో 'కలయిదనీ' పాట రావడం జరుగుతుంది. చరణాల్లో 'నెరవేరని యీ మమకారాలేమో..' అంటూ దర్శకుడు విఫలప్రేమను సూచించాడు. 'ఏది నేరని ప్రాయాన' అంటూ ప్రేమ అని తెలుసుకోలేకపోవడానికి కారణం చిన్నవయసు కావడమే అని హీరోపట్ల జాలి కలిగించాడు.

బెంగాలీ సినిమాలో యీ ఘట్టాల్లో పాట అవీ ఏమీ లేవు. పార్వతి పెళ్లి సమయానికి దేవదాసు మొదటిసారి వేశ్యాగృహానికి వెళ్లినట్లు, చంద్రముఖి నృత్యం చూస్తూ పార్వతిని తలచుకుని కళ్లు తిరిగినట్లు చూపించాడు. చంద్రముఖి ఆవేదనతో వచ్చి అతని చేతులు పట్టుకుంటుంది. అక్కడ షాట్ కట్ చేసి, పార్వతి పాణిగ్రహణాన్ని చూపిస్తారు. తెలుగు సినిమాలో యిలా లేదు.

ముసలి జమీందారుతో పెళ్లి తర్వాత పార్వతి పాత్రలో పూర్తిగా హుందాతనం వచ్చేసింది. సవతి పిల్లలను తన పిల్లలుగా అక్కున చేర్చుకుంది. సవతి కూతుర్ని పిలిచి ఆమెకు తన నగలన్నీ యిచ్చేసి మంచి చేసుకుంది. అది చూసి మురిసిపోయిన జమీందారు ఆమెను ఆయుష్మతివి కమ్మని ఆశీర్వదిస్తాడు – నవలలో, బెంగాలీ సినిమాలో. కానీ తెలుగుసినిమాలో 'దేవుడు నీకు మేలు చేస్తాడు' అంటూ ఆశీర్వదిస్తూంటాడు. అలా దేవదాసును పార్వతి మర్చిపోకుండా చేశాడు తెలుగు సినిమాకారుడు.





చంద్రముఖి పాత్రలో బెంగాలీ సినిమాలో సుప్రియా దేవి, తెలుగు సినిమాలో లలిత (ప్రముఖ నటి పద్మిని పెద్దక్క)

పార్వతి తన సవతి పిల్లలకు దేవదాసు కథ చెప్పడం కూడా సినిమాలో చేర్చినదే, దాని ద్వారా పార్వతి దేవదాసు గురించి నిరంతరం ఆలోచిస్తోందని చూపించారు. ఇక్కడనుండి దేవదాసు జీవితంలో పార్వతి వెనక్కి వెళ్ళి, చంద్రముఖి ముందుకు వచ్చింది. 'డబ్బుంటే ఆనందానికి ఏం లోటు?' అంటూ భగవాన్ చంద్రముఖి అనే ఓ వేశ్య వద్దకు తీసుకెళ్లాడు.

కానీ మొదటిసారి అక్కడకు వెళ్లిన దేవదాసుకు అసహ్యం వేసింది. డబ్బు కోసమేగా యిదంతా? అంటూ ఆమె ముఖాన డబ్బు కొట్టి బయటకు వచ్చేశాడు. కానీ దానివలన చంద్రముఖికి తనపై తనకు రోత కలిగింది. అతనిపై మమత కలిగింది. మళ్లీ అతన్ని తీసుకుని రమ్మనమని చునీలాల్ (తెలుగులో భగవాన్)ని కోరింది. చునీలాల్ కోరికపై దేవదాసు మళ్లీ వెళ్లాడు. ఆమె సాదరంగా ఆహ్వానించింది.

దేవదాసు అంటే తాగుబోతు అనే అర్థం రూఢి అయిపోయింది కదా. నిజానికి దేవదాసు తాగుడు ఎప్పుడు, ఎలా మొదలెట్టాడు అన్న విషయంపై శరత్‌బాబు వివరణ యివ్వలేదు. కానీ మన తెలుగువాళ్లు దానికో సన్నివేశం కల్పించారు. దిక్కులేని పరిస్థితుల్లోనే భగవాన్ దాన్ని బ్రాందీ అని చెప్పకుండా యిచ్చినట్లు, మర్నాడు బ్రాందీ అని నిజం చెప్పి ఆ అలవాటును హద్దుల్లోనే వుంచుకోవాలని జాగ్రత్తలు చెప్పినట్టు, దేవదాసు పక్కా తాగుబోతు అయినప్పుడు పశ్చాత్తాపపడినట్టు చూపించి భగవాన్ పాత్రను ఎలివేట్ చేశారు. నవలలోనే కాదు, బెంగాలీ సినిమాలో కూడా యిలాటి ప్రయత్నాలు జరగలేదు.

తాగిన నిషాలోనే దేవదాసు చంద్రముఖి వద్దకు వెళుతూంటాడు. తనకు తోచినది మాట్లాడుతూంటాడు. చంద్రముఖి అతన్ని ఆరాధిస్తుంది. తన వృత్తిని వదులుకుంటుంది. దేవదాసు తన యింట్లో పాదం మోపిన క్షణంనుంచే ఆమెలో మార్పు వచ్చినట్టు తెలుగు సినిమాలో డ్రమెటిక్‌గా చూపించారు. కానీ నవలలో ఆ మార్పు క్రమంగా వస్తుంది.

ఈ దశలోనే దేవదాసు తండ్రి పోయాడు. అన్నగారు ఆస్తిలో చాలాభాగం కైవసం చేసుకున్నాడు. దేవదాసు తాగుబోతు అయిపోయి ఊళ్లో అల్లరిపాలవుతున్నాడు. ఈ విషయాలన్నీ తెలిసి పార్వతి స్వంత వూరొచ్చి దేవదాసుని మందలించబోయింది. ఇక తాగుడు మానేస్తానని మాట యియ్యి అంది. దేవదాసు అడ్డదిడ్డంగా, తిక్కతిక్కగా మాట్లాడాడు. నన్ను ఒక్కసారైనా తలచుకోనని ప్రతిజ్ఞ చేయి అన్నాడు.

కాస్సేపు పోయాక ఆమె మరీ రొక్కిస్తే అందరూ అన్ని పనులూ చేయలేరు అని చెప్పి

తప్పించుకోబోయాడు. ఇష్టమైతే తప్పకుండా చేయగలరు అంది పార్వతి. అయితే ఈ రాత్రి నాతో లేచిపోయి వస్తావా? అన్నాడు. పెళ్లిచేసుకోమని పార్వతి అంటే నీ లాటి పిల్లని చూడు అన్నాడు దేవదాసు. ఇప్పుడు అతని మనసుకు పూర్తిగా తెలుసు – పార్వతియే తనకు కావలసిన అమ్మాయి అని. కానీ యీ ఎరిక చాలా ఆలస్యంగా కలిగింది.

అది గ్రహించిన పార్వతి ఏడ్చింది. "ఇక్కడ మీ యింట్లో నిన్ను చూసే వారెవరూ లేరు. మా యింటికి రా, సేవ చేసి తరిస్తా" అంది. ఇక్కడే క్లయిమాక్స్‌కి కావలసిన అంశానికి పునాది పడుతుంది. నవలలోని యీ ఘట్టాన్ని బెంగాలీలో కూడా యిలాగే తీశారు.

**పార్వతి యింటికి వస్తానని దేవదాసు మాటిచ్చే సందర్భం బెంగాలీలో, తెలుగులో**



ఇక్కడ తెలుగు సినిమావాళ్లు కీలకమైన మరో ముక్క చేర్చారు. "ప్రాణాలు పోయినా వస్తాను" అని దేవదాసు చేత అనిపించారు. దేవదాసు తల్లి కాశీ వెళ్లిపోయింది. అన్నగారు, వదిన యితన్ని పట్టించుకోవడం మానేశారు. ఇతను కలకత్తా వెళ్లి చంద్రముఖిని చూడబోయాడు. ఆమె యిల్లు యిప్పుడు శూన్యంగా వుంది. నగలన్నీ అమ్మేసి, ఆ డబ్బు వడ్డీ కిచ్చి సింపుల్‌గా బతుకుతోంది. ఊరు వదిలి వెళ్లిపోయేదే కానీ ఎవ్వటికైనా దేవదాసు



వస్తాడేమోనని ఆశగా చూస్తూ వుండిపోయింది.



ఇదంతా తెలిసి దేవదాసు ఆశ్చర్యపడ్డాడు. ఎందుకిదంతా అని అడిగాడు. నువ్వు నన్ను ఏవగించుకున్నావ్. అయినా నువ్వేం చేసినా నా కిష్టంగానే తోచింది. నాకు ఒక విచిత్రమైన వ్యక్తిలా తోచావ్. అంది. దేవదాసు ఆమెకు కొంత డబ్బు యిచ్చి పట్నం వదలి వెళ్లిపోమంటాడు. ఆమె పార్వతి గురించి దేవదాసుకు వున్న అపోహలను దూరం చేస్తుంది. బెంగాలీ సినిమాలో యిలాగే చూపినా, తెలుగు సినిమాలో యీ ఘట్టాన్ని తర్వాత చూపారు.

కుడి ఎడమైతే పాట పెట్టి దేవదాసు సెల్ఫ్‌పిటీని, 'మునకే సుఖమనుకోవోయ్' అనే నిరాశనూ తెలుగు సినిమాలో చక్కగా చూపించారు. దేవదాసు దుస్థితి గురించి తన ఫ్రెండ్ ఉత్తరం రాస్తే పార్వతి మళ్లీ వచ్చింది. నవలలో ముందురోజే దేవదాసు పట్నం వెళ్లిపోయాడు అని రాస్తే తెలుగు సినిమాలో యీమె మేనా, అతని బండి ఎదురైనట్టు, ఒకరి నొకరు చూసుకోనట్టు మంచి మెలో డ్రామా పెట్టారు.

దేవదాసు తాగుబోతై క్రమంగా క్షీణించడం రెండేళ్లు పట్టినట్టు నవలలో రాశారు. సినిమాలో టైమ్ లాప్స్ అంతగా చూపించలేదు. 'చెలియ లేదు, చెలిమి లేదు' పాటలో కొంతకాలం సాగినట్టు చూపించేశారు. నవల ప్రకారం చంద్రముఖి పట్నం వదలి, ఒక పల్లెటూరిలో కొన్నాళ్లు వుంటుంది. అక్కడనుండి దేవదాసు గురించి వాకబు చేయడానికి అతని వూరు వెళుతుంది. ఆ ఘట్టాన్ని బెంగాలీ సినిమాలో పెట్టారు. అయితే అక్కడ వాళ్లు కాస్త మార్పు చేశారు. దేవదాసు కోసం వస్తున్న మేనాలో వెళుతున్న పార్వతిని నడిచి వస్తున్న చంద్రముఖి చూస్తుంది.



దేవదాసు పట్నంలోనే వున్నాడని తెలుసుకున్న చంద్రముఖి అతన్ని వెతుకుతూ పట్నం రోడ్లు గాలించింది. ఇక్కడే జగమే మాయ పాట వస్తుంది. నవలలో, బెంగాలీ సినిమాలో చంద్రముఖి మాత్రమే వుంటే తెలుగు సినిమాలో ధర్మన్న కూడా తోడుగా వున్నట్టు పెట్టారు. తెలుగు దేవదాసు సినిమా క్లాసిక్ కావడానికి కారణాలేమిటో యిలాటి ఘట్టాలు పోల్చి చూస్తే తెలుస్తాయి.

బెంగాలీ సినిమాలో యీ పాట ఏమీ లేదు. నాగేశ్వరరావు, సావిత్రి గార్ల అభినయం, గొప్ప సాహిత్యం, అంతకంటా గొప్ప సంగీతం, ఆ పాటలను చిత్రీకరించిన బియస్ రంగా ఫోటోగ్రఫీ వీటన్నిటికీ మార్కులు పడతాయి.

ఆరోగ్యం పాడై పోయిన దేవదాసుకు చంద్రముఖి సేవ చేసింది. పార్వతి గురించి అతని మెదడులోని కన్ఫ్యూజన్‌ను చంద్రముఖి క్లియర్ చేసింది. పార్వతి మోసం చేయలేదని చెప్పింది. అప్పుడు దేవదాసు చంద్రముఖి పట్ల తన అనురాగాన్ని వెలువరించాడు. మళ్లీ జన్మంటూ వుంటే నిన్ను వదిలిపెట్టనన్నాడు. నవలలోనూ, బెంగాలీ సినిమాలోనూ యీ ఘట్టం రెండు భాగాలుగా వస్తుంది.

ఇక్కడ ఒకేదాంట్లో పెట్టారు. పార్వతి నిన్ను మోసం చేయలేదని చెప్పేటప్పుడు బెంగాలీ సినిమాలో చంద్రముఖిపై నేపథ్యగీతం పెట్టారు. దీని తర్వాత సేవచేసేటప్పుడు దేవదాసు చంద్రముఖిని నిన్ను ముద్దుపేరుతో పిలుస్తాను. అంటూ 'బో' అని సంబోధిస్తాడు. బో అంటే భార్య అని. అది ఆమెను పులకింపజేస్తుంది. కానీ తెలుగు సినిమాలో 'అమ్మీ' అంటాడు. బెంగాలీ నవలను తెలుగులోకి అనువదించినవారు కూడా నవలలో అమ్మీ అనే వాడారు. దానిలో ఔచిత్యమేమిటో నాకు అర్థం కాలేదు.

నవలలో దేవదాసు చాలా వూళ్లు తిరుగుతాడు. అలహాబాదుకి వెళతాడు. లాహోర్‌లో చునీలాల్ వున్నాడని తెలిసి అక్కడకు వెళతాడు. ఆరోగ్యం చెడిపోయి తాగుడు మధ్యమధ్యలో మానేస్తూంటాడు, మళ్లీ మొదలెడతాడు. తల్లి కాశీలో వుందని

వెళదామంటాడు. చివరకు యింటికి వెళదామని అంటాడు. బెంగాలీ, తెలుగు సినిమాలలో కూడా యివన్నీ కట్ చేసేశారు. చంద్రముఖికి గుడ్‌బై చెప్పి మధ్యలోనే వెళ్ళిపోతాడు. తెలుగు సినిమాలో చంద్రముఖితో డాక్టర్‌తో 'ఇతను ఆట్టే రోజులు వుండడు' అని చెప్పించి అతని అనారోగ్యాన్ని సూచించారు.

స్వంతవూరికి వెళుతూండగానే మధ్యలో పార్వతి వూరు తాలూకు స్టేషన్ రావడంతో దేవదాసు దిగిపోయాడు. తెలుగు సినిమాలో పార్వతికి యిచ్చిన మాట గుర్తుకు వచ్చినట్టు చూపించారు. ధర్మదానును వదిలిపెట్టి ఒంటరిగా స్టేషన్‌లో దిగి బండి కట్టించుకుంటాడు. అవస్థలు పడుతూ వెళ్లాడు. నవలలో అయితే ముందురోజు వర్షం పడి దారి పాడై వుంటుంది. కానీ తెలుగులో వాన రావడం, బురద, దేవదాసే దిగి బండి త్రోయడం అదీ పెట్టి డ్రమటైజ్ చేశారు. బెంగాలీలో యింత హంగామా లేదు.

నవల ప్రకారం దేవదాసు వూరు చేరగానే జమీందారు (పార్వతి భర్త) యింటి ఎదురుగా వున్న చెట్టు కింద పడుక్కోబెడతారు. అతను మాట్లాడే పరిస్థితిలో లేడు. రాత్రంతా అలాగే వుండి పొద్దున్న పోయాడు. మేడ మీద వున్న పార్వతికి యిది తెలిసి అయ్యో పాపం అనుకుంటుంది.

చనిపోయాక అతను ఫలానా అని జేబులో ఉత్తరాల వలన తెలుస్తుంది. పార్వతి సవతికొడుకు పిన్ని వూరే కదా, ఆమె వచ్చి చూస్తే గుర్తిస్తుందేమో అంటాడు. జమీందారు శవాన్ని గుర్తించడానికి ఆమె రావాలా అని కేకలేస్తాడు. చనిపోయినవాఢు ఫలానా అని పార్వతికి శవదహనమైన సాయంత్రం తెలుస్తుంది.

ఆమె ఏడుస్తూ బయటకు వెళ్లబోతూ వుండగా సవతి కొడుకు వెంట వెళ్లాడు. జమీందారు ఆపాడు. ఆమె మూర్ఛపోయింది. తర్వాత మెలకువ వచ్చాక ఆమె శోకతప్తయై మిగిలిపోయింది అని శరత్‌బాబు ముగించారు.

కానీ బెంగాలీ సినిమాలో కాస్త డ్రామా పెట్టారు. దేవదాసు శవం అక్కడ వుండగానే పార్వతి పరిగెట్టింది. జమీందారు వెళ్లవద్దు అన్నాడు. ఆమె ఎలుగెత్తి పిలుస్తూ నిలిచిపోయింది. మనవాళ్లు మరింత ఎఫెక్టివ్‌గా పెట్టారు. దేవదాసు బండిలో వస్తూండగానే పార్వతికి పీడకల రావడం, ఆమె రాత్రంతా భగవంతుణ్ని ప్రార్థిస్తూ కూచోవడం, పూజామందిరంలో దీపం అల్లల్లాడడం, జమీందారు కాళ్లకింద దేవదాసు పార్వతికి బహూకరించిన నెక్లసు ముక్కలవడం యిదంతా మనవాళ్ల కల్పనే.

పైగా చివర్లో దేవదాసు శవం అక్కడ వుండగానే కొడుకు వచ్చి ఫలానా అని చెప్పడం,

పార్వతి పరుగులు పెడుతూ మెట్లమీదనుంచి దొర్లడం, జమీందారు తలుపులు వేసేయమని అరవడం, దానితో ఆ తలుపు తలకు కొట్టుకుని పార్వతి పడిపోయి చనిపోవడం యివన్నీ కల్పించారు.

నిజానికి శరత్‌బాబు దేవదాసు పాత్రను ధీరోదాత్తుడిగా చిత్రీకరించలేదు. అతన్ని చూసి జాలిపడ్డాడు. మననీ పడమన్నాడు. దేవదాసులాంటి హతభాగ్యులతో, నిగ్రహం లేనివారితో, మీకు పరిచయం కలిగితే వారికోసం కన్నీరు కార్చమన్నాడు. అతనిలాటి చావు ఎవరికీ రావద్దన్నాడు. అతను ఆదర్శపురుషుడు కానప్పటికీ పాఠకులు, ప్రేక్షకులు దేవదాసును హృదయానికి హత్తుకున్నారు. అభిమానించారు, ఆరాధించారు. అతనితో మమేకమయ్యారు.

గ్రీకు విషాదాంత నాటకాల్లో, షేక్‌స్పియర్ నాటకాల్లో కనబడే విషాద కథానాయకుడి స్థాయికి అతన్ని చేర్చారు. అందుకే అనేక భాషల్లోనూ ఈ సినిమా హిట్ అయింది. తెలుగులో మరీ అయింది. దాని మన వాళ్ల కంట్రిబ్యూషన్ ఎంత వుందో చూశాం కదా!

●



# శివమణి

నాగేశ్వరరావు గారి "దేవదాసు" గురించి తెలుసుకున్నాం కదా. ఇప్పుడు వారబ్బాయి నాగార్జున "శివమణి" మూలాల్లోకి వెళదాం. సినిమా కథకోసం ఎక్కడెక్కడో గాలించడం జరుగుతుంది. ఒక చిన్న పాయింటు ఏదైనా పుస్తకంలో గాని, పరభాషా చిత్రంలో గాని దొరికితే దాన్ని ఆధారం చేసుకుని కథ అల్లుకోవడం జరుగుతుంది. అంతమాత్రం చేత ఆ సినిమాను కాపీ కొట్టినట్టు కాదు. 'శివమణి' అనే 2003 నాటి సినిమాలో ఓ మహిళా జర్నలిస్టుకు సముద్రపు ఒడ్డున ఓ సీసాలో ఓ ఉత్తరం దొరుకుతుంది. ఆ ఉత్తరంలో వ్యక్తమైన ప్రేమ ఆమెను కదిలిస్తుంది. అది రాసినవాళ్లు ఎవరాని వెతుకుతూ బయలుదేరుతుంది. ఆ కథను తను పనిచేసే పత్రికలో వేస్తుంది.




ఈ ఘట్టం చూడగానే మన విమర్శకులు కొందరు 'మెసేజ్ యిన్ ఎ బాటిల్' అనే ఇంగ్లీషు సినిమాకు యీ సినిమా కాపీ అని తేల్చిపారేశారు. మనం ఆ రెండు సినిమాలను పరామర్శిద్దాం. అప్పుడు ఏ మేరకు మనవాళ్లు యిన్‌స్పిరేషన్ తీసుకున్నారు, మన వాతావరణానికి అనువుగా ఎంత మార్చారు అన్నది అర్థమవుతుంది. నికోలస్ స్పార్క్స్ రాసిన మెసేజ్ ఇన్ ఎ బాటిల్ అనే నవల ఆధారంగా అదే పేరుతో 1999 లో సినిమా తయారైంది. రాబిన్ రైట్ పెన్ అనే నటీమణి జర్నలిస్టు వేషం వేసింది. కథానాయకుడిగా కెవిన్ కాస్టనర్ వేశారు. దర్శకత్వం లూయీ

మన్‌డోకో. తెలుగులో హీరో నాగార్జున, హీరోయిన్ ఆశిన్. జర్నలిస్టు వేషం వేసినది రక్షిత. కథ, దర్శకత్వం పూరీ జగన్నాథ్.

ఇంగ్లీషు సినిమాలో హీరోయిన్ ఓ జర్నలిస్టు. షికాగో ట్రిబ్యూన్‌లో ఉద్యోగం. భర్తతో విడిపోయింది. వాళ్లిద్దరికీ పుట్టిన కొడుకుని అప్పుడప్పుడు భర్త వద్ద విడిచిపెట్టాలి కాబట్టి అతన్ని ఎయిర్‌పోర్టులో విడిచిపెట్టి హాలీడేయింగ్‌కు బయలుదేరింది. సముద్రతీరంలోని ఒక ప్రదేశానికి వచ్చి సముద్రపు ఒడ్డున జాగింగ్ చేస్తూ వుండగా ఓ సీసా దొరికింది. దానిలో చూస్తే ఓ ఉత్తరం ఉంది. 'జి' అనే అతను కేథరిన్ అనే అమ్మాయికి రాసిన ప్రేమలేఖ అది. ఆ వుత్తరంలో రాసిన భావానికి, భాషకు ఆమె చలించిపోయింది.



ఆమె ఒకర్తే కాదు, చదివినవారందరూ ముగ్ధులైపోయారు. దానిలో పలికిన విషాదానికి చలించిపోయారు. ఆఫీసులో కొలీగ్స్ మధ్య యిదే చర్చ. ఈ చర్చచూసి ఏమిటి సంగతి అని ఎడిటర్ అడిగాడు. వీళ్లలో ఒకరు కాజువల్‌గా చెపితే ఆయన దీనిపై ఓ కథనం వేసేశాడు – మా కొలీగ్‌కు యిలా ఓ ప్రేమలేఖ దొరికింది అంటూ. తనను అడగకుండా అలా వేసినందుకు హీరోయిన్‌కు కోపం వచ్చింది కానీ ఆ కథనానికి విపరీతమైన రెస్పాన్సు వచ్చింది. కుప్పలకొద్దీ ఉత్తరాలు వచ్చిపడ్డాయి. వాటిలో నాకూ యిలాగే ఓ సీసాలో ఓ ఉత్తరం దొరికింది అంటూ మరో ఉత్తరం పంపాడు ఓ పాఠకుడు. అది రాసినదీ యీ 'జి' అనే అతనే.

ఆ ప్రేమలేఖల్లోని కవిత్వానికి ముగ్ధులయిపోయిన హీరోయిన్, ఆమె కొలీగ్స్‌కి ఇంత గాఢంగా ప్రేమించేవారెవడో తెలుసుకోవాలనే ఆత్రుత పెరిగింది అందరూ కలిసి ఆ రకమైన బాటిల్స్ తయారుచేసే కంపెనీ గురించి, ఆ పేపరు తయారుచేసే కంపెనీ గురించి, సముద్రంలో ఆ బాటిల్ ప్రయాణించిన వుండిన దారి గురించి మ్యాప్‌లో చూసి అన్వేషణ సాగించారు. ఉత్తరం రాసినది ఓ లెటర్ హెడ్ మీద. ఆ లెటర్‌హెడ్ ఎవరు అచ్చు వేశారో వెతికారు.

చివరకు ఆ లెటర్‌హెడ్ ఆర్డరు యిచ్చినవాడి అడ్రసు దొరికింది. వేరే రాష్ట్రంలో సముద్రతీరంలో వుంటాడతను. కారు వేసుకుని వెళ్లింది. అతని యిల్లు కనిపెట్టింది. అతని పేరు గారెట్ బ్లేక్. పడవలు రిపేరు చేస్తూ వుంటాడు. అతని తండ్రి డాడ్జ్ – ఆ పాత్ర వేసినది పాల్ న్యూమన్ – యీమెను పలకరించాడు. గారెట్ ఫలానా చోట వుంటాడని చెప్పాడు. హీరోయిన్ గారెట్ వద్దకు వెళ్లి తను రీసెర్చర్‌నని చెప్పుకుని పరిచయం చేసుకుంది. అతని బోటులో తనని సముద్రంలోకి తీసుకెళ్లమని కోరింది. అతను తీసుకెళ్లాడు. వారిద్దరి పరిచయాన్ని అతని తండ్రి హర్షించాడు. ప్రోత్సహించాడు. ఇద్దరికీ స్నేహం కుదిరింది. అప్పుడు హీరో తన కథ చెప్పాడు




ఆ ఉత్తరంలో రాసిన కేథరిన్ హీరో భార్య. రెండేళ్ల క్రితం జబ్బుతో చనిపోయింది. ఆమె అందగత్తె, మంచి పెయింటర్ కూడా. ఆమెను తలచుకుంటూ అతను ఉత్తరాలు రాసి బాటిల్‌లో పెట్టి పడేస్తూ వుంటాడు. తనను విడిచి భార్య మృత్యువు వద్దకు వెళ్లిపోయిందని అతని ఫిర్యాదు. భార్యపై అంత ప్రేమ కనబరచే మగాణ్ని చూసి జర్నలిస్టుకు ఆరాధన కలిగింది. ఎందుకంటే ఆమె భర్త ఆమె వుండగానే మరో అమ్మాయితో సంబంధం పెట్టుకున్నాడు. ఈమె బతిమాలినా వినలేదు. ఓ ఏడాది చూసి వదిలేసింది. కొడుకుని తనవద్దనే పెట్టుకుంది. తన కథ అతనికి చెప్పింది. క్రమేపీ వారిద్దరి మధ్యా ప్రేమ అంకురించింది.

తెలుగు సినిమాలో జర్నలిస్టు (రక్షిత) వైజాగ్‌లో ఆంధ్రజ్యోతిలో పనిచేస్తూ వుంటుంది. పెళ్లి కాలేదు. ప్రేమించే మగాడికోసం చూస్తూ వుంది. ఓ రోజు తన కొలీగ్‌తో వైజాగ్ బీచ్‌లో జాగింగ్ చేస్తూ వుండగా బాటిల్ కంటపడింది. బాటిల్‌లో కనబడిన ఉత్తరం



చదివింది. అది ఒరిజినల్ సినిమాలో లాగ ఒక భర్త తన భార్యకు రాసినది కాదు. ఓ ప్రేయసి తన ప్రియుడికి రాసినది. తను ఆపదలో వున్నానని, తప్పించుకుని మనం ఎప్పుడూ కలుసుకునే చోట కలుసుకుందామని వసంత అనే అమ్మాయి మణి అనే అబ్బాయికి రాసింది. తారీకు చూస్తే రెండేళ్ల క్రితంది. లెటర్‌హెడ్ చూస్తే కొచ్చిన్‌లో షిప్పింగ్ కంపెనీ. బాటిల్ వైజాగ్ దాకా కొట్టుకుని వచ్చింది.

'సీసా తెచ్చిన సందేశం' అని పేపర్లో కథనం వేసి హీరోయిన్ తను కొచ్చిన్‌కు బయలుదేరింది. అక్కడ షిప్పింగ్ కంపెనీ గురించి వాకబు చేస్తూండగానే హీరో (నాగార్జున) గూండాలను తంతూ వుండగా చూసింది. అతను, అతని పక్కన వున్న చెలికాడు తెలుగువాళ్లని గ్రహించి స్నేహం కలపబోయింది. హీరో కోపంగా వుండడంతో అతని స్నేహితుడు ఆలీతో స్నేహం కలిపింది. ఉత్తరంలో వున్న మణి, యితనూ ఒకరేమోనని ఆమె అనుమానం. కానీ అతను యీమెను చూస్తే విసుక్కుంటున్నాడు. ఎదురింటి కాటేజీలో నివాసం ఏర్పరచుకుని ఆలీని మచ్చిక చేసుకుని అతని ద్వారా వివరాలు రాబట్టింది. అతను హీరో ఫ్లాష్‌బ్యాక్ చెప్పేశాడు. తక్కిన కథ వచ్చే మంగళవారం

హీరో ఓ పోలీసు యిన్‌స్పెక్టర్. వైజాగ్‌లో పూర్ణామార్కెట్ ఏరియాకు సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌గా వచ్చాడు. అక్కడ ఎస్సయి సహాయంతో గూండాలు చేస్తున్న ఆరాచకానికి అడ్డుకట్ట కట్టాడు. అతని పద్ధతి చూసి జేబుదొంగ ఆలీ తన పాత వ్యవహారాలు మానేసి అతని యింట్లో పనివాడిగా చేరాడు. అక్కడి అరాచకాలకు మూలస్తంభం విలన్ దత్తు (ప్రకాష్‌రాజ్) అని తెలిసి హీరో అతని డెన్‌కి వెళ్లి అతనికే వార్నింగ్ యిచ్చాడు. దొంగవ్యాపారాలు మానేయమన్నాడు. విలన్ పోలీసు శాఖలో తన మిత్రుడైన ఎసిపి ద్వారా హీరోకి చెప్పించాడు. కానీ హీరో వినలేదు సరికదా ఒక ప్రెస్‌మీట్ పెట్టి పోలీసులకు, పబ్లిక్‌కు మధ్య తను వారధిగా వుంటానన్నాడు. ఫోన్ చేస్తే చాలు వచ్చి వాలతానన్నాడు. దాంతో విలన్‌కు ఒళ్లుమండి యితన్ని బదిలీ చేయించాడు.

హీరో ఓ పోలీసు యిన్‌స్పెక్టర్. వైజాగ్‌లో పూర్ణామార్కెట్ ఏరియాకు సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌గా



వచ్చాడు. అక్కడ ఎస్సయి సహాయంతో గూండాలు చేస్తున్న ఆరాచకానికి అడ్డుకట్ట కట్టాడు. అతని పద్ధతి చూసి జేబుదొంగ ఆలీ తన పాత వ్యవహారాలు మానేసి అతని యింట్లో పనివాడిగా చేరాడు. అక్కడి అరాచకాలకు మూలస్తంభం విలన్ దత్తు (ప్రకాష్‌రాజ్) అని తెలిసి హీరో అతని డెన్‌కి వెళ్లి అతనికే వార్నింగ్ యిచ్చాడు. దొంగవ్యాపారాలు మానేయమన్నాడు. విలన్ పోలీసు శాఖలో తన మిత్రుడైన ఎసిపి ద్వారా హీరోకి చెప్పించాడు.

కానీ హీరో వినలేదు సరికదా ఒక ప్రెస్‌మీట్ పెట్టి పోలీసులకు, పబ్లిక్‌కు మధ్య తను వారధిగా వుంటానన్నాడు. ఫోన్ చేస్తే చాలు వచ్చి వాలతానన్నాడు. దాంతో విలన్‌కు ఒళ్లుమండి యితన్ని బదిలీ చేయించాడు. హీరో అతన్నే బెదిరించి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ కాన్సిల్ చేయించాడు. ఇతని హీరోయిజం చూసి హీరోయిన్ (ఆసిన్) అతనితో ప్రేమలో పడింది. గుడిలో వాళ్ల అమ్మగారు పరిచయమైతే వాళ్ల యింటికి వచ్చింది. అప్పుడు ఫలానా అని తెలిసింది. హీరో, హీరో తల్లి కూడా ఆమెను యిష్టపడ్డారు.

హీరోను చూసి విలన్ అనుచరుల్లో దడ పుట్టింది. వారిలో ఒకడు పని మానేస్తానంటే విలన్ అతని భార్యను చంపేశాడు. అతను హీరో వద్దకు వచ్చి విలన్ విషయాలన్నీ చెప్పి అప్రూవర్‌గా మారిపోతానన్నాడు. ఆ విషయం తెలిసి విలన్ అతన్ని దారుణంగా నడిరోడ్డుమీద చంపేశాడు. ఎవరూ సాక్ష్యం చెప్పరనుకున్నాడు కానీ హీరో యిచ్చిన ధైర్యంతో జనం తెగించారు. సాక్ష్యం చెప్తామన్నారు. ఓ ముసలాయన సాక్ష్యం చెప్తాననడంతో అందరూ ముందుకు వచ్చారు. దాని ఆధారంగా హీరో విలన్‌పై కేసు పెట్టబోయాడు. హీరో తనపై కేసు పెట్టిస్తున్నాడని తెలిసిన విలన్ అతని తల్లిపై ఎటాక్ చేశాడు. కేసు విచారణ జరిగింది.

కోర్టు విలన్‌ను వైజాగ్ నుండి ఐదేళ్లపాటు బహిష్కరించింది. హీరో విలన్ యింటిపై ఎటాక్ చేసినపుడు అక్కడ హీరోయిన్ కనబడింది. ఆమెకు విలన్ మేనమామ వరుస.

హీరోయిన్ తండ్రి కొచ్చిన్‌కి వెళ్లి షిప్పింగ్ కంపెనీ పెట్టుకున్నాడు. చదువుకోసం విలన్ వద్దకు పంపాడు. విలన్ చేసిన దాడిలో గాయపడిన హీరో తల్లికి పక్షవాతం వచ్చింది. కేరళలో మంచి వైద్యం దొరుకుతుందని హీరోయిన్ అంటే అక్కడకు వెళ్లారు హీరో, అతని తల్లి.

అయితే వైజాగ్‌నుండి అయిదేళ్లపాటు బహిష్కరించబడిన విలన్ అక్కడ తేలాడు. హీరో గురించి హీరోయిన్ తండ్రికి ఫిర్యాదు చేశాడు. హీరో, హీరోయిన్ బోటు మీద ఎక్కడికో వెళ్లారు. 4 రోజుల తర్వాత హీరో ఒక్కడూ గాయాలతో తిరిగి వచ్చాడు. అతని తల్లిని ఎవరో చంపేశారు. హీరోయిన్ ఏమైందో తెలియదు. హీరో ఎవరికీ చెప్పటం లేదు. ఆలీ చెప్పిన ఫ్లాష్‌బ్యాక్ యిక్కడితో ముగుస్తుంది. ఇక్కడిదాకా చెప్పినదానితో జర్నలిస్టు తన పత్రికకు సీరియల్ రాసి పంపుతూ వచ్చింది. అది చాలా పాప్యులర్ అయి జనాలలో ఉత్సుకత రేకెత్తించింది.

ఇక ఇంగ్లీషు సినిమా సంగతేమిటో చూద్దాం. హీరో జర్నలిస్టుతో తిరుగుతున్నాడని తెలిసి అతని అత్తగారు, బావమరిది అతనిపై దండెత్తారు. నువ్వు యింకో అమ్మాయి ప్రేమలో పడ్డావు కాబట్టి మా అమ్మాయి గీసిన పెయింటింగ్స్ అవీ మాకు యిచ్చేయమన్నారు. హీరో గిల్టీగా ఫీలయ్యాడు. కానీ హీరోయిన్‌తో అతని ప్రణయం, ప్రణయకలహం కూడా జరిగాయి. ఆమె షికాగోకి తిరిగి వెళ్లిపోయింది. అతని గురించి పత్రికాఫీసులోని ఆమె కొలీగ్స్ వాకబు చేశారు. ఆ ఉత్తరాలు రాసే అతన్ని కలిశావా? ఎలాటివాడు? అని అడిగారు.

'అతనికి భార్య అంటే పిచ్చి యిష్టం. ఇంకెవర్నీ కన్నెత్తి చూడడు' అనేసింది. కానీ అతని వద్దనుండి ఓ రోజు ఫోన్ వచ్చింది నిన్ను చూడాలని వుంది అంటూ. ఈమె కోసం అతను తన గ్రామాన్నుండి బయలుదేరి వచ్చాడు. గతాన్ని మర్చిపోయి, వర్తమానాన్ని ఆహ్వానించమని హితవు చెపుతూ తండ్రి అతన్ని సాదరంగా వట్టానికి



పంపాడు. ఇతను జర్నలిస్టుకి, ఆమె కొడుక్కి బహుమతులు తెచ్చాడు. ఆఫీసులో అందర్నీ కలిశాడు. ఇటువంటి గాఢప్రేమికుడు తనకు ప్రియుడైనందుకు ఆమె ఎంతో సంతోషించింది. ఆమె గదిలో ఇద్దరూ ఏకమైయ్యారు.

ఆ రాత్రి ఆమె నిద్రిస్తూండగా తను రాసి సముద్రంలో సీసాలో విడిచిన ఉత్తరాలు అతని కంట పడ్డాయి. తమ స్నేహంలో ఎన్నడూ ఆమె వీటి గురించి చెప్పలేదు. ఇవెలా వచ్చాయా అనుకున్నాడు. ఇవేమీ లేకుండానే తనంటే యిష్టపడిందనుకున్నాడు. ఇంట్లో పాత పేపర్లు చూసేసరికి ఆమె యీ ఉత్తరాలు చూసిందనీ, తనను వెంటాడుతూ వచ్చిందని, తనతో ప్రేమ నటించి తన నుండి కథ రాబట్టి పత్రికలో వేసుకుంటూ కెరియర్ వృద్ధి చేసుకుందని అనుకున్నాడు. హర్ట్ అయ్యాడు.

ఆ ఉత్తరాల్లో అతని భార్య వుత్తరం కూడా కనబడింది. చనిపోవడానికి మూడురోజుల క్రితం ఆమె దాన్ని రాసి సముద్రంలో పడేసింది. ఆ ఉత్తరం చదవగానే హీరో చలించిపోయాడు. ఇంతలో జర్నలిస్టు నిద్ర లేచింది. నా భార్య జ్ఞాపకార్థం ఆ ఆఖరి ఉత్తరం నాకు యిచ్చేసేయి. మనం స్నేహితుల్లా విడిపోదాం అన్నాడు. తనను అతను అపార్థం చేసుకున్నందుకు, కెరియర్ కోసమే అతనితో ప్రేమ నటించానని అనుకున్నందుకు ఆమె బాధపడింది. ఆమె అతన్ని నిజంగా ప్రేమించింది. కానీ ఉత్తరాల విషయం ముందే చెప్పకపోవడం వలన ఈ అనర్థం జరిగింది. ఆమె మారు మాట్లాడకుండా అతనికి ఆ ఉత్తరం యిచ్చేసింది. ప్రేమ విఫలమైనందుకు ఆమెకు ఆశాభంగం జరిగింది. మళ్లీ ఒంటరి జీవితమే. కొలీగ్స్ ఆమెను ఓదార్చారు.

తెలుగు సినిమాలో జర్నలిస్టు అమ్మాయి హీరోను ప్రేమించింది. అతన్ని వశపరచుకుందామని చూసింది. కానీ అతను లొంగలేదు. తన ప్రేయసిని మరవలేకుండా వున్నాడని గ్రహించి గౌరవం పెంచుకుంది. ఎలాగైనా ఆ అమ్మాయి జాడ కనిపెట్టాలనుకుని హీరోనే అడిగింది. ఏ కళనున్నాడో ఎవరికీ చెప్పని విషయాలు చెప్పాడతను – తనూ, హీరోయిన్ వెళ్లిన ద్వీపానికి విలన్ వచ్చిపడ్డాడు. తనను కొట్టి ఓ స్తంభానికి కట్టిపడేశారు. హీరోయిన్‌ను ఓ బోటులో ఎత్తుకుపోయారు. ఆమె "మనం ఎప్పుడూ కలిసే చోటుకి రా, నీకోసం ఎదురు చూస్తా" అని హీరోయిన్ ఉత్తరం రాసి ఒక బాటిల్‌లో పెట్టి హీరో కళ్లెదురుగా సముద్రంలో పడేసింది. అది అతనికి చేరుతుందని, అతను చదివి వైజాగ్‌లో కలుస్తాడని ఆశిస్తుంది. కానీ ఆ సీసా హీరో కళ్లెదురుగానే కొట్టుకుపోతుంది. నాలుగు రోజుల అతన్ని తర్వాత ఎవరో రక్షించారు. కొచ్చిన్‌కు




తిరిగి వచ్చి చూస్తే తల్లిని చంపేశారని తెలిసింది. హీరోయిన్ రాని వదేసిన ఉత్తరంలో ఏముందో తెలియదు. అప్పటినుండీ విలన్‌కోసం, హీరోయిన్ కోసం వెతుకుతున్నాడు.

జర్నలిస్టు హీరోకి తనకు దొరికిన వుత్తరం గురించి చెప్పలేదు. ఆ వుత్తరంలో వున్న విషయం గురించి చెప్పలేదు. రెండేళ్ల క్రితం ఉత్తరం రాసి పడేసిన అమ్మాయి ఇప్పటిదాకా బతికి వుందో లేదో తెలియదు. మీరు ఎప్పుడూ కలిసే చోటు ఏది? అని అడిగితే వైజాగ్‌లో గంగవరం బీచ్ అని హీరో చెప్పాడు కాబట్టి అక్కడే వెతికి ఆమె దొరికితేనే యితనికి చెపుదామనుకుంది. తన స్టాఫ్‌ని హీరోయిన్ కోసం ఆ బీచ్‌పై నిఘా పెట్టమంది. పత్రికకు యీ కథంతా పంపి వేయించింది. ఆ కథ చదివైనా హీరోయిన్ ఆ బీచ్‌కి వచ్చి ఎదురు చూస్తుందని. పత్రికలో విలన్ గురించి మొత్తమంతా రావడంతో వైజాగ్‌లో అతని స్నేహితుడైన ఎసిపి ఫోన్ చేసి విలన్‌కి చెప్పాడు. ఎవరో విలేకరి అక్కడే కేరళలో వుండి కథనాలు పంపుతోందని. ఇంతకీ హీరోయిన్ బతికి వుందా అంటే లేదు చచ్చిపోయిందని విలన్ చెప్పాడు.

ఇంగ్లీషు సినిమాకు, తెలుగు సినిమాకు వున్న ప్రధానమైన తేడా – తెలుగులో జర్నలిస్టు హీరోను తన ప్రేయసితో కలపాలని చూస్తుంది. ఇంగ్లీషు సినిమాలో ఆమె హీరో భార్య స్థానాన్ని పొందుదామని చూస్తుంది. వృత్తిలో రాణించడానికి తనను ప్రేమించినట్టు నటించి కథ రాబట్టిందని అపోహపడి జర్నలిస్టుకు గుడ్‌బై చెప్పి వెళ్లిపోయిన హీరో తన భార్య వేసిన పెయింటింగ్స్‌ను అత్తగారికి యిచ్చేశాడు. ఆమె పేర తయారుచేస్తూ చేస్తూ ఆపేసిన పడవ పని మళ్లీ మొదలుపెట్టాడు. బోటు తయారయ్యాక జర్నలిస్టుకు ఆహ్వానం పంపాడు. "నీ కారణంగా నా భార్య ఆఖరి వుత్తరం దొరికింది. ఆమె భావాలు తెలిసాయి. కృతజ్ఞుణ్ని. ఈ బోటును సముద్రంలో వదిలే సమయానికి నువ్వు

రావాలి." అని కోరాడు. ఈమె వెళ్లింది. అయితే ఆ బోటుపై వున్నది అతని భార్య పేరే – కాథరీన్ ! అతని హృదయంలోనుండి భార్య బొమ్మ చెరిగిపోలేదని గ్రహించి జర్నలిస్టు తిరిగి వెళ్లిపోబోయింది. అతను వచ్చి 'ఐ యామ్ సారీ' అన్నాడు. 'ఐ కెన్ అండర్‌స్టాండ్. నువ్వు గతాన్ని విడువలేవు' అంది. జర్నలిస్టు వెళ్లిపోయాక హీరో తండ్రి అతన్ని తిట్టాడు – గతంలో నివసిస్తూ వర్తమానాన్ని చేజార్చుకుంటున్నందుకు !

ఒక ఏడాది గడిచిన తర్వాత హీరో తండ్రి జర్నలిస్టును కలిశాడు – హీరో చనిపోయాడని చెప్పడానికి. ఓ రోజు బోటులో వెళ్లి వేరేవారిని రక్షిస్తూ తాను మునిగిపోయాడు. అతని బోటులో బాటిల్‌లో ఓ ఉత్తరం దొరికింది. అది చనిపోయే ముందు రోజు హీరో తన భార్యపేర రాసిన వుత్తరం ! 'నిన్ను ఎంతగా ప్రేమించానో ఆ జర్నలిస్టు అమ్మాయిని కూడా ప్రేమిస్తున్నాను. నేను మళ్లీ ప్రేమలో పడేట్లా చేసిందామె. నీకు గుడ్‌బై చెప్పడానికే యీ వుత్తరం' అని రాశాడు. పడవ ప్రయాణం నుండి తిరిగి వస్తే అతను యీమెను చేసుకునేవాడే! కానీ విధి వేరేలా తలచింది. అతను చనిపోయాడు. ఈమె ఏకాకిగా మిగిలింది. ఇంగ్లీషు ఒరిజినల్ యిలా విషాదంగా ముగిసింది కదా తెలుగు సినిమా ఎలా ముగిసిందో చూదాం.

తన కథను బయటపెట్టిన జర్నలిస్టు గురించి వెతుకుతూ విలన్ కొచ్చిన్ వచ్చాడు. ఆలీ చూసి హీరోకి చెప్పడంతో అతను విలన్‌ను ఎటాక్ చేశాడు. విలన్ దొరకలేదు లేదు కానీ అతని అసిస్టెంటు దొరికాడు. అతనినుండి హీరో కూపీలాగడం మొదలెట్టాడు.

ఇక్కడ గంగవరం బీచ్‌లో జర్నలిస్టు కాపు కాసింది. ఎప్పటికైనా హీరో గురించి ఎదురుచూస్తూ హీరోయిన్ రాకపోతుందా అని. ఓ రోజు హీరోయిన్ వచ్చింది. మీరే పల్లవి కదా అంటే మాట్లాడకుండా వెళ్లిపోయింది. మీ కథ పత్రికలలో చూడలేదా అంటే లైబ్రరీలకు వెళ్లి చదివింది. జర్నలిస్టు అమ్మాయి మంచితనం, ఆమె ప్రయత్నం హీరోయిన్‌కు అర్థమయ్యాయి. జర్నలిస్టు వద్దకు వెళ్లి తన కథ రాసి చూపించింది. హీరో గురించి అడుగుతూ వచ్చిన హీరో



తల్లిని విలన్ చంపేశాడు. నువ్వు కొట్టిన చెంపదెబ్బతోనే చచ్చిపోయిందని హీరోయిన్ తండ్రిని భయపెట్టి దాక్కోమన్నాడు. తన పేర పవరాఫ్ ఎటార్నీ రాయించుకుని బిజినెస్ తన కైవసం చేసుకున్నాడు. ఓ రోజు యిదేమిటని నిలదీస్తే హీరోయిన్ తండ్రిని చంపేశాడు. తప్పించుకుని బోటులో పారిపోతున్న హీరోయిన్ కంఠానికి కత్తి విసిరితే ఆమె సముద్రంలో పడిపోయింది. ఆమె చనిపోయిందనుకున్నాడు కానీ జాలర్లు కాపాడారు. ప్రాణం నిలిచింది కానీ గొంతు పోయింది. ఈ స్థితిలో అతన్ని పెళ్లి చేసుకోమని అడగలేను కాబట్టి పనిమనిషిగా పనిచేస్తూ బతుకుతున్నాను అంది.

విషయాలు తెలియగానే జర్నలిస్టు హీరోకి ఫోన్ చేసింది. అప్పటికి అతను విలన్‌ను చంపబోతున్నాడు. జర్నలిస్టు చేసింది కదాని ఫోన్ తీసుకున్నాడు. తన ప్రేయసికి ఏం జరిగిందో తెలుసుకున్నాడు. అతను హీరోయిన్‌తో ఎమోషనల్‌గా మాట్లాడే సమయంలో విలన్ అదను చూసుకుని పారిపోయాడు. కానీ పగ బట్టాడు. తనకేం జరిగినా ఫర్వాలేదు కానీ హీరో హీరోయిన్లు ఏకం కాకూడదనే పట్టుదలతో వైజాగ్‌లో ఎసిపి సహాయం కోరాడు. పత్రికల ద్వారా శివమణి కథ చదివిన పాఠకులందరూ హీరో హీరోయిన్ల కలయిక కళ్లారా చూడాలని గుమిగూడిన వేలాదిమంది సమక్షంలోనే హీరోయిన్‌ను కిడ్నాప్ చేశాడు. హీరో మోటర్‌సైకిల్‌పై ఛేజ్ చేశాడు. క్లయిమాక్స్‌లో ఏమవుతుందో సులభంగా వూహించవచ్చు. జనాలు విలన్‌ను తొక్కేయడంతో యిసుకలో కూరుకుపోయాడు. హీరోహీరోయిన్లు ఏకమయ్యారు.

ఇంగ్లీషు సినిమాను ఒక విషాదాంత ప్రేమగాథగా మలిచారు. హీరో చాలా సింపుల్ వ్యక్తి. హీరోయిజం ప్రదర్శించడు. అతనిలో గొప్పతనం భార్యను గాఢంగా ప్రేమించడం. తర్వాత జర్నలిస్టును కూడా ప్రేమించాడు. భార్యకు చెప్పి చేసుకుందామనుకున్నాడు. హీరో పడవప్రయాణం నుండి తిరిగి వస్తే హీరోయిన్‌ను చేసుకునేవాడు కదా అనే ఆలోచన మనల్ని వెంటాడుతుంది. తెలుగు సినిమాలో హీరోను పోలీసు ఆఫీసరు చేసి హీరోయిజం, వయొలెన్సు, క్రయిమ్ పెట్టారు. హీరోయిన్‌కు పాటలంటే వున్న యింట్రస్టు తొలి సీన్లలో ఎస్టాబ్లిష్ చేసి చివరిలో ఆమె గొంతు పోగొట్టి అయ్యో అనిపించి ప్రేక్షకుడి మనసులో ఓ ముల్లు నాటారు. ఆలీ, ఎమ్మెస్ నారాయణ అందించిన హాస్యం సంగతి సరేసరి. ఇంగ్లీషు సినిమాలో బాక్‌గ్రౌండ్ మ్యూజిక్ లాగానే తెలుగు సినిమాలో పాటలు కూడా బాగుంటాయి. ఇదీ శివమణి సినిమా అసలు కథ.



## దాగుడుమూతలు

కొన్ని తెలుగు సినిమాలు చూస్తే స్వతంత్రంగా అల్లుకున్నట్టే అనిపిస్తాయి. కానీ వాటి మూలాలు వేరే ఎక్కడో కనబడతాయి. కానీ చాలా మార్పులు కూడా కనబడతాయి. అంటే ఏమిటన్నమాట? ఎక్కడో ఓ సినిమాను చూసి యిన్స్పైరై కథ రాసుకోవడం మొదలుపెట్టి ఆ క్రమంలో మూలకథకు చాలా దూరంగా వచ్చేస్తారు. అది పూర్తిగా స్వతంత్రంగా వెళ్లిపోతుంది. చాలా జాగ్రత్తగా చూస్తేనే గాని మూలానికి, యీ కొత్త చిత్రానికీ పోలిక కనబడదు. ఆ పోలిక మనకు స్ఫురిస్తే అప్పుడు రెండింటినీ పోల్చి చూసినపుడు మనవాళ్ల సృజనాత్మకతకు అబ్బురం వేస్తుంది.

ఒక మంచివాడైన సామాన్యుడికి బోల్డంత ముదనష్టపు ఆస్తి కలిసి వస్తే ఎలా ప్రవర్తిస్తాడు అనే ఓ వూహతో ప్రపంచప్రఖ్యాత దర్శకుడు ఫ్రాంక్ కాప్రా 'మిస్టర్ డీడ్స్ గోస్ టు టౌన్" అనే సినిమా 1936లో తీశారు. ఓ బాగా డబ్బున్నాయన యాక్సిడెంటులో పోయాడు. వారసుడెవరాని వెతికితే ఓ పల్లెటూళ్లో ఓ పరోపకారి అని తేలింది. అతన్ని పట్టుకుని వచ్చి డబ్బు అప్పగించారు లాయర్లు. అతనికి దానిమీద పెద్ద ఆసక్తి లేదు. తన సాధారణ జీవితమే చాలతనికి. ఆస్తి అందరికీ పంచిపెట్టేస్తే పోలా? అనుకున్నాడు. డబ్బు కోసం ఐనవాళ్లని సైతం హత్యలు చేసే యీ లోకంలో యింత మంచివాడు పిచ్చివాడుగా అనిపించాడు లాయర్లకు, ఆ ఆస్తిమీద కన్నేసిన బంధువులకూ. దాంతో అంతా కలిసి అతనిమీద పిచ్చివాడి ముద్ర వేసి అల్లరి చేశారు. దానికి తోడు మీడియా ఒకటి. అతని ప్రతిపనికి విపరీతార్థం తీసి అతన్ని రచ్చకెక్కించింది. దాంతో






అతను విసిగిపోయి స్వంత వూరికి వెళ్లిపోదామనుకున్నాడు.

ఈ కథలోనుండి ముళ్లపూడి వెంకటరమణగారు "దాగుడు మూతలు" కథ అల్లారు. డబ్బున్నవాడిని సినిమా మొదట్లోనే చంపేయకుండా సినిమాలో సగం దాకా లాక్కుని వచ్చారు. హీరోకి స్వయానా తాతగార్ని చేశారు. ఈ సినిమా రిలీజైన 1964 నాటికి మీడియా యిప్పటంత ముదిరిపోలేదు కాబట్టి హీరోయిన్‌ను మోసకారి జర్నలిస్టుగా కాకుండా సాయపడే అమ్మాయిగా మార్చారు. ఒరిజినల్‌లో వుండే సంఘటన ఒక్కటీ యిక్కడ కనబడదు. స్టోరీ లైన్ మాత్రం తీసుకుని పూర్తిగా లోకలైజ్ చేశారు కాబట్టి యీ కథ యిక్కడ పుట్టినదే అనిపించింది. ఆ కథా, కమామీషూ చూద్దాం. మొదట ఇంగ్లీషు సినిమా కాస్త పరికిద్దాం.

మార్టిన్ సెంపిల్ అనే ఓ కోటీశ్వరుడు కారు యాక్సిడెంటులో చనిపోయాడు. అతనికి ముందూ వెనకా ఎవరూ లేరు. మర్నాడు పేపర్లలో అదే న్యూస్. ఆయనకున్న 20 మిలియన్ల ఆస్తికి వారసుడెవరు? అని. అతని వకీలు ఐన సెడార్ విల్లు చదవబోతున్నాడు. న్యూస్ పేపర్ ఆఫీసులో ఒకటే అలజడి. ఆ అదృష్టవంతుడెవరో అందరి కంటె ముందే కనిపెట్టి పేపర్లో వేసేయాలని..చివరకు లాయరు విల్లు చదివాడు. ఆ వారసుడు మాంద్రేక్ ఫాల్స్ అనే పల్లెటూళ్లో నివసించే 28 యేళ్ల లాంగ్‌ఫెలో డీడ్స్ అనే ఓ దూరపుబంధువు. అతన్ని వెతికి పట్టుకుని ఆస్తి అప్పగించడానికి లాయరు సెడార్, ఎస్టేటు మేనేజర్ కాబ్స్ బయలుదేరారు.

ఆ పల్లెటూళ్లో దొరికాడు మన హీరో. ఇతనే ఆ హీరో. పాత్రధారి గారీ కూపర్. అతనికి పద్యాలు రాయడం ఓ హాబీ. ట్యూబా వాయించడం మరోటి. లాయర్లు చెప్పిన 20 మిలియన్ల డాలర్ల ఆస్తి అతన్ని కదిలించలేదు. ఎగిరి గంతేయలేదు, సరికదా 'నాకేం అవసరం లేదే, నాకెందుకు రాశాడు ముసలాయన?' అని ఆశ్చర్యపడ్డాడు కూడా. తమ వూళ్లో అందరికీ తలలో నాలుకలా వుండే హీరోకి యింత అదృష్టం

వట్టినందుకు పూరం సంతోషించింది. అతనికి సంతోషంగా వీడ్కోలు పలికింది. ఇంత వెర్రిబాగులవాడికి ఆస్తి దక్కినందుకు లాయర్లూ సంతోషించారు. తమ చేతిలోంచి ఆస్తి అజమాయిషీ చేజారదు కదాని. పవరాఫ్ ఎటార్నీ తమకే యివ్వాలని గట్టిగా చెప్పారు. ఈ ఘట్టం వరకు తెలుగు సినిమా ఎలా సాగిందో చూడబోతే –



గుమ్మడి ఓ డబ్బున్న ఆసామీ. అతని కొడుకు ప్రేమ వివాహం చేసుకుంటే కోపగించి యింట్లోంచి వెళ్లగొట్టాడు. తర్వాత కొంతకాలానికి పశ్చాత్తాపపడి వాళ్ల గురించి వెతికేసరికే ఆలస్యమై పోయింది. వైద్యం చేయించుకోలేక కొడుకు, ఆకటితో అలమటించి కోడలు చనిపోయారు. దారిన పోయే దానయ్య మనవణ్ని చేరదీసి పెంచాడు. కొంతకాలానికి ఆ దానయ్య, అతని భార్యా పోయారు – వాళ్ల హోటల్, ఐదుగురు ఆడపిల్లల బాధ్యతా హీరో ఎన్టీయార్‌కి అప్పగించి. ఆ హోటల్ గుమ్మడి ఫ్యాక్టరీకి ఎదురుగానే వుంది. వాళ్ల జీతాలు అంతంత మాత్రమే. హీరో జాలి కొద్దీ వాళ్లకి తన హోటల్లో అరువులు యిస్తూ వుంటాడు.

ఓ రోజు వాళ్ల హోటల్‌కి హీరోయిన్ బి.సరోజ వచ్చింది. సవతితల్లి కన్యాశుల్కానికి ఆశపడి ముసలాడికి యిచ్చి పెళ్లి చేయబోతే తండ్రి సలహా మేరకు యింట్లోంచి పారిపోయి వచ్చింది. బియ్యే చదివింది కాబట్టి ఉద్యోగం వస్తుందన్న ఆశ వుంది. కానీ ఆమె దగ్గర వున్నది సత్తు రూపాయే! హోటల్లో ఆ రూపాయితో టిఫెన్ తినబోయి భంగపడింది. బయటకు వచ్చి రోడ్డు మీద నడుస్తూంటే ఆమె జడలోంచి ఓ పూవు జారిపడింది. ఆ దారిన సైకిలుమీద పోతున్న పద్మనాభం అది చూసి పువ్వు తిరిగి యిచ్చేద్దామని ఆమె వెంట పడ్డాడు. అతను గుమ్మడి బంధువు, అమాయకుడు. సరోజ అతన్ని అపార్థం




చేసుకుని ఆడపిల్లలున్న ఓ యింట్లో దూరింది. అది హీరోదే. ఆ పిల్లలే హీరో పెంపుడు చెల్లెళ్లే. వాళ్ల సాయంతో పద్మనాభాన్ని తరివేసింది. రాత్రికి యింటికి వచ్చిన హీరో ఆమెను చూశాడు. ఆమె కథ విని జాలిపడి తన యింట్లోనే వుండమన్నాడు. ఫ్యాక్టరీలో ఉద్యోగం చూస్తానన్నాడు.

ఇక ఫ్యాక్టరీ యజమాని గుమ్మడి యింటి పరిస్థితి ఎలా వుందో చూడబోతే ఆయన డబ్బున్న ఒంటరి మనిషి. వారసులు లేరు కాబట్టి బంధువులంతా రాబందుల్లా మూగారు. ఆయన ఆలనాపాలనా చూసుకోవడానికి మేమున్నామంటూ అక్కడే తిష్ట వేశారు. వీరిలో రమణారెడ్డి గుమ్మడికి అల్లుడు వరుస. ఆస్తి అజమాయిషీ అతనిదే. వాళ్ల అమ్మాయి శారద పద్మనాభాన్ని ప్రేమిస్తోంది. పద్మనాభం గుమ్మడికి మనుమడి వరుస. అతని తల్లి సూర్యకాంతం. వీళ్లంతా యీయన ఎప్పుడు ఛస్తాడా అని కాచిపెట్టుకుని కూచున్నవాళ్లే తప్ప వీళ్లలో ఎవ్వరూ ఆయన మందూ, మాకూ తిండీ తిప్పలూ చూడరు. ఈ పరిస్థితుల్లో ఫ్యాక్టరీలో వుద్యోగం అడగవచ్చిన హీరోయిన్‌ను చూసి ముచ్చటపడిన గుమ్మడి తన వద్దనే వుండి నర్సుగా పనిచేయమన్నాడు. క్రమేపీ ఆమె అంటే అభిమానం పెంచుకోవడంతో బంధువులకు కన్ను కుట్టింది. మంచి ఉద్యోగం వచ్చినా హీరో బలవంతం మీద హీరోయిన్ అతని యింట్లోనే వుండిపోయింది. అతని మనసుకు చేరువైంది.

గుమ్మడి తన మనుమడి కోసం అలమటిస్తూ ఫ్యాక్టరీని పట్టించుకోడు. ఓ సారి హీరో హీరోయిన్ కోసం టిఫిన్ పట్టుకుని వచ్చి తోటలో పనిచేసుకుంటున్న గుమ్మడిని చూసి తోటమాలి అనుకుని టిఫిన్ పెట్టి, ముసలాయన ఫ్యాక్టరీ వర్కర్స్ బాగోగులు పట్టించుకోక పోవడం బట్టే మనుమడు దొరకటం లేదని అంటాడు. మర్నాడే గుమ్మడి ఫ్యాక్టరీకి వచ్చి వర్కర్లను రమణారెడ్డి పీడిస్తున్న సంగతి గమనించి పరిస్థితి చక్కదిద్దుతాడు.

తన కళ్లు తెరిపించినందుకు హీరోకి థాంక్స్ చెప్తాడు. ఇది సామాన్యప్రజలందరికీ చాలా ముచ్చట గొలిపే అంశం కావడంతో బాటు హీరో సోషలిస్టు ఫిలాసఫీని కూడా ప్రేక్షకులకు పరిచయం చేస్తుంది. ఉన్నది పదిమందికీ వంచాలి, లేనివాడికి ఆదుకోవాలి అని గట్టిగా అనుకోవడంవల్లనే నడమంత్రపు సిరి అబ్బినా అతను మారడు.



గుమ్మడి కొడుకు తద్దినం వచ్చింది. కొడుక్కి తను చేసిన ద్రోహం తలచుకుని గుమ్మడి కుమిలిపోయి ప్రాణం మీదకు తెచ్చుకున్నాడు. ఇక బంధువులు విజృంభించారు. పద్మనాభాన్ని గుమ్మడి దత్తత తీసుకునేట్టు రమణారెడ్డి మేనేజ్ చేసేట్టు, దానికి ప్రతిగా పద్మనాభం శారదను పెళ్లి చేసుకునేట్టు తమలో తాము ఒప్పందం చేసుకుని గుమ్మడిని దత్తతకు ఒప్పించారు. కుట్రలో పురోహితుడు అల్లు రామలింగయ్యను భాగస్వామిని చేశారు. మనుమడు దొరుకుతాడన్న ఆశ విడిచిన గుమ్మడి సరేనన్నాడు.

దత్తత ఫంక్షన్ రోజున హీరోయిన్ గుమ్మడి వద్దకు వచ్చి అతని కొడుకు ఫోటో చూసింది. ఆ ఫోటోను ఆమె హీరో వద్ద కూడా చూసింది. వెంటనే గుర్తుపట్టింది, హీరోయే గుమ్మడి వెతుకుతున్న మనుమడు అని. వెంటనే హీరోని ఉన్నపళంగా లాక్కుని వచ్చింది. అంతే పద్మనాభం దత్తత కాన్సిలై పోయింది. గుమ్మడి హీరోని దత్తత చేసుకున్నాడు. గుమ్మడి పెద్ద ఫంక్షన్ చేశాడు. తన కొడుక్కి చేసిన అన్యాయానికి ప్రాయశ్చిత్తం చేసుకున్నానని మహా ఆనందపడ్డాడు. ఆ ఫంక్షన్‌లోనే తృప్తిగా




కన్నుమూశాడు. అందలం ఎక్కినా మారిపోను అని హీరో హామీ యిస్తూ డాన్సుచేస్తూండగానే గుమ్మడి పోయాడు. హీరో వారసుడై పోయాడు. ఇదంతా తెలుగులో కలిపిన భాగం.

ముదనష్టపు డబ్బు కలిసి వచ్చాక ఇంగ్లీషు సినిమాలో హీరో ప్రవర్తన ఏమిటో, అతనికి ఏం జరిగిందో చూద్దాం – చనిపోయిన ముసలాయనకు దగ్గర బంధువు ఒకతను వున్నాడు. అతనూ అతని భార్యా పదేళ్లగా ఆయన ఎప్పుడూ ఛస్తాడా అని చూస్తున్నారు. ఇప్పుడు ఎక్కణ్నుంచో హీరో వూడిపడి వారసుడు కావడంతో యిది దొంగ విల్లని పేచీ పెట్టడానికి ఆలోచిస్తున్నారు. ఇంతలో ఓ లాయరు హీరో దగ్గరకి, అతని లాయరు దగ్గరకి వచ్చాడు. 'పోయిన ముసలాయనకు నా క్లయింటు భార్య కాని భార్య. ఆమెకు ఆస్తిలో మూడోవంతు రావాలి' అన్నాడు. హీరోగారి తరఫున వకీలుగా వున్న సెడార్ 'వచ్చిన లాయరు మాటల్ని పట్టించుకోవద్ద'ని అంటే మన హీరో 'ఆవిడ ముసలాయనకు భార్య అయితే ఆస్తంతా ఆమెకే దక్కాలి. మూడోవంతు మాత్రమే ఎందుకడగాలి? అంతా ఆవిణ్నే తీసుకోమను. నాకేమీ అక్కరలేదు' అనేశాడు. వకీలు సెడార్ తెల్లబోయాడు యిదేం తిక్కరా బాబూ అని. మళ్లీ మర్నాడే ఆ 'భార్య కాని భార్య' లాయరు వచ్చి తన క్లయింటుకి 'మూడోవంతు అక్కరలేదు, ఇరవయ్యో వంతు యిచ్చినా చాల'న్నాడు. హీరోకి అనుమానం వచ్చింది. ఇదేదో దొంగ వ్యవహారంలా వుంది. అసలు భార్య లాటిది కాదేమో. ఇలా మోసాలు చేస్తే తంతా జాగ్రత్త అన్నాడు. అంటే హీరోది చాలా స్ట్రెయిట్ ఫార్వర్డ్ వ్యవహారం. అవతలివాడు నిజాయితీపరుడైతే అడిగినదంతా యిచ్చేయడం, మోసగాడైతే తన్ని తగిలేయడం !

ముసలాయన బతికుండగా ఓ సాంస్కృతిక సంఘానికి అధ్యక్షుడిగా వుండేవాడు. ఆ సంఘం వాళ్లు ఓ మీటింగ్ పెట్టి హీరోని పిలిచి 'ఆయన స్థానంలో నువ్వు వున్నావు కాబట్టి సంస్థకు వచ్చిన రెండు లక్షల డాలర్ల నష్టం పూడ్చడానికి విరాళం యిమ్మ'న్నారు వాళ్లు. 'నష్టాలొస్తున్నాయంటే అర్థం మీ కార్యక్రమాలు చెత్తగా వున్నాయన్నమాట. నేను డబ్బు యివ్వను. కార్యక్రమాలు మెరుగుపరుచుకోండి. లేదా సంస్థ మూసుకోండి' అని

కామన్ సెన్స్‌తో చెప్పాడు హీరో. వాళ్లు వీడెక్కడి తిక్కవాడురా అనుకున్నారు.

హీరో బాగోగులు చూస్తామంటూ తయారైన వకీళ్లు అతనికి ఓ సహాయకుణ్ని పెట్టారు. కానీ అతను తనకు సేవ చేయబోతే హీరో వద్దన్నాడు. నాకేం అక్కరలేదన్నాడు. లేనిపోని భేషజాలు పెట్టుకోకుండా హ్యాపీగా బతకబోయాడు. మెట్లమీద నుండి హుందాగా దిగకుండా దాని రెయిలింగ్ మీద కూర్చుని జర్రున కిందకి జారాడు. ఇదంతా చూసి పనివాళ్లు నవ్వుకున్నారు. బోల్డంత డబ్బు వచ్చి పడిన హీరోకు రక్షణ కల్పిస్తున్నామంటూ అతను ఎక్కడికి వెళ్లకుండా లాయర్లు సెక్యూరిటీవాళ్లకు కాపలా పెట్టారు. పంజరంలో చిలకలా వుండడం యిష్టం లేని ఇతను బయటకు సరదాగా వెళ్లబోతూ వుంటే వాళ్లు అడ్డుపడ్డారు. ఇతనికి ఒళ్లుమండి వాళ్లను బీరువాలో పెట్టి తాళం వేసి హాయిగా వర్షంలో తడుస్తూ సామాన్యుడిలాగానే బయటకు వెళ్లాడు.

తెలుగు సినిమాలో హీరో కూడా నడమంత్రపు సిరి అబ్బినా మారిపోలేదు. అంతేకాదు కామన్ సెన్స్ కూడా విడిచి పెట్టలేదు. దాన్ని చక్కగా చూపించారు. లక్ష రూపాయల ఖర్చుతో గుమ్మడికి కంచు విగ్రహం వేయిద్దామని రమణారెడ్డి అంటే దాని కంటె మిల్లులో వర్కర్లకు వాటాలిస్తే వాళ్ల గుండెల్లోనే విగ్రహాలు వెలుస్తాయి కదా అంటాడు హీరో. దాంతో రమణారెడ్డి తారెత్తి పోతాడు. ఇలా అయితే ఆస్తంతా కరిగిపోతుంది అనుకుని దొంగ విల్లు తయారుచేస్తాడు. దాని ప్రకారం హీరో రమణారెడ్డి కూతురు శారదను పెళ్లి చేసుకోవాలి లేకపోతే ఆస్తి వదులుకు పోవాలి. సూర్యకాంతం, అల్లు రామలింగయ్యలతో కలిసి యీ దొంగ విల్లు తయారుచేసాడు. హీరోయిన్‌ను గాఢంగా ప్రేమించిన హీరో ఆస్తయినా వదిలేస్తాడు తప్ప ఆమెను వదలడు అని సూర్యకాంతం ఆశ. అలా జరిగితే సరే, తన కూతురు పద్మనాభాన్ని పెళ్లి చేసుకోవచ్చు, ఒకవేళ హీరో హీరోయిన్‌ను కాదనుకుని ఆస్తినే ఎంచుకుని తన కూతుర్ని చేసుకున్నా మంచిదే అని రమణారెడ్డి ప్లాను.




వీళ్ల కుట్రను గ్రహించిన హీరో శారదతో కలిసి

నాటకం ఆడాడు. కానీ అది చాటుగా విన్న హీరోయిన్ పొరబాటుగా అర్థం చేసుకుంది. డబ్బు వచ్చాక హీరో మారిపోయాడనుకుని సవతి తల్లి చెప్పిన సంబంధాన్ని చేసుకుంటానంది. హీరోకి విషయం తెలిసి వచ్చి బతిమాలాడు కానీ అపార్థం చేసుకున్న హీరోయిన్ వినలేదు. ఎల్లుండే తనకు పెళ్లి అని చెప్పింది. దాంతో అతనికి మతిపోయింది. పిచ్చివాడిలా ప్రవర్తించాడు. శారదతో తన పెళ్లికి ఏర్పాట్లు చేస్తే వాళ్లను తరిమి కొట్టాడు. డబ్బు వలననే కదా యిన్ని కష్టాలు వచ్చాయి అనుకుని డబ్బు విసిరేశాడు. ఇదే అదను కదాని యితను పిచ్చివాడై పోయాడని చెప్పి రమణారెడ్డి పోలీసుల చేత అరెస్టు చేయించాడు. ఇలా హీరోయిన్ అతని కష్టాలకు పరోక్షంగా కారణభూతురాలైంది. ఒరిజినల్‌లో హీరోయిన్ అపార్థంతో కాకుండా స్వార్థబుద్ధితో అతని కష్టాలకు కారణభూతురాలౌతుంది. ఆమె కథ వచ్చే మంగళవారం.

ఇంగ్లీషు సినిమాలో హీరోకి హఠాత్తుగా డబ్బు వచ్చిపడింది కాబట్టి మన యిప్పటి తెలుగు మీడియాలాగ అప్పటి అమెరికన్ మీడియా ఆతృతపడింది. ఒక పత్రికాఫీసులో యీ కొత్త వారసుడిపై కథనాలు రాయాలని పథకాలు వేసింది. 'అంత డబ్బు ఒక్కసారి వచ్చిపడితే ఎలా వుంది'? 'నీకు పెళ్లయిందా'? 'కాకపోతే ఎలాటి అమ్మాయంటే యిష్టం'? ఇలాటి ప్రశ్నలన్నీ వేసి పేపరు అమ్మకాలు పెంచుకుందామంటే హీరోకి లాయర్‌గా అవతరించిన సెడార్ పత్రికల వాళ్ల నెవర్నీ దగ్గరకు రానీయడం లేదు. అప్పుడు పత్రి ఎడిటర్ స్టాఫ్ మీటింగ్ పెట్టి అందర్నీ తిట్టాడు – మీరు వాజమ్మలు, ఎలాగోలా ఆ నదమంత్రపు సిరి గాడిమీద స్టోరీ చేయలేరు అని. అప్పుడు హీరోయిన్ ముందుకు వచ్చింది – నేను అతనికి ఎలాగోలాగ చేరువై అతనిపై ఎక్స్‌క్లూజివ్ కథనాలు రాస్తా, పత్రిక అమ్మకాలు పెంచుతా అని. ఆమె ఆ పత్రికలో జర్నలిస్టు. పాత్రధారి జీన్ ఆర్థర్.



ఆ తర్వాత తన పథకం అమలులోకి పెట్టింది. అమాయకుడైన హీరోను బోల్తా కొట్టించి, అతన్ని బుట్టలో పెట్టడానికి హీరోయిన్ తిండిలేని, నిరుద్యోగియైన, ఓ బీద అమ్మాయిగా నటించింది. ఆపదలో వున్న అమ్మాయిని రక్షించి ప్రేమించి పెళ్లాడాలన్న సదాశయంతో యిన్నాళ్లూ బ్రహ్మచారిగా వున్న హీరో కరిగాడు. ఆమెను డిన్నర్‌కు తీసుకెళ్లాడు. అక్కడ హోటల్లో న్యూయార్క్‌లోని ప్రముఖ కవులు తగిలారు. వాళ్లు యితన్ని రెచ్చగొట్టి పద్యాలు రాయించి వాటిని వెక్కిరించి ఆనందించారు. మామూలుగా విమర్శించి వుంటే సహించునేమో కానీ వెక్కిరిస్తున్నారని అర్థమై ఒళ్లు మండింది హీరోకి. వాళ్లను నాలుగు గుద్దులు గుద్ది వుతికి పారేశాడు. మర్నాటికల్లా హీరోయిన్ యీ కథంతా పేపర్లో రాసి పేరు తెచ్చుకుంది. హీరోకి 'సిండ్రెల్లా మాన్' అని నిక్‌నేమ్ పెట్టి వెక్కిరిస్తూ రాసింది.

సిండరెల్లా జానపద కథల్లో ఓ పాత్ర. సవతితల్లి చేతుల్లో తన్నులు తింటూ వుంటుంది, హఠాత్తుగా ఆమెకు అదృష్టదేవత ఆమెను కరుణించడంతో మంచి డ్రెస్సు వేసుకుని, రథంమీద ఆమె యువరాజు యిచ్చే విందుకి వెళుతుంది. యువరాజు ఆమె అందం చూసి వరించాడు. ఆ విధంగా ఆమెకు నడమంత్రపు సిరి అబ్బింది. మన హీరోని కూడా యిలాగే నడమంత్రపుసిరి వరించిందని హీరోయిన్ వ్యంగ్యంగా 'సిండరెల్లా మ్యాన్' అని నిక్‌నేమ్ పెట్టింది. అంతేకాదు అతను తాగి రోడ్డుమీద అర్ధనగ్నంగా తందనాలాడాడని, తన్నులు తిన్నాడనీ... యిలా రాసింది. పేపరు అమ్మకాలు పెరిగాయి. ఈమెకు ఆఫీసులో పేరు వచ్చింది.

ఇలా తన కెరియర్‌కోసం హీరోని బలిపశువును చేసిన హీరోయిన్ మర్నాడు రాత్రి కూడా అతన్ని వూరు తిప్పింది. బస్సు ఎక్కించింది. అతని పల్లెటూరి చేష్టలనూ, అమాయకంగా మాట్లాడినవాటినీ మర్నాడు పేపరు కెక్కించింది. పార్టీ తర్వాత వాళ్లు బస్సుపై ఊరంతా తిరిగారు. అక్కడేదో తక్కినవాళ్లు అల్లరి చేస్తే యితను తన పల్లెటూరి ధోరణిలో పోట్లాడాడు. దానికి చిలవలు పలవలు జోడించి ఆమె పేపర్లో రాసేది. కానీ హీరో ఆమెను సిన్సియర్‌గా ప్రేమించాడు. తన సంగీతనైపుణ్యం ఆమె వద్ద ప్రదర్శించాడు.

ఇలా కొన్నాళ్లు చేశాక ఆమె ఎడిటర్‌తో కన్ఫెస్ చేసింది. 'నా కెరియర్ అవకాశాలు పెంచుకోవడం కోసం యిలాటి అమాయకుణ్ని యిక అల్లరి పెట్టలేను. అతనికి అన్నీ చెప్పేసి తప్పు ఒప్పుకుంటాను' అని. ఎందుకంటే మధ్యలో హీరో ఒకసారి ఆమెతో చెప్పాడు – 'ఈ పట్నవాసపు పోకడలు నాకు పడవు. ఇవన్నీ వదిలేసి మా వూరికి

వెళ్లిపోతా' అని. బీద అమ్మాయివైనా ఫర్వాలేదు నిన్ను పెళ్లి చేసుకుంటా అని ఆమెకు ప్రపోజ్ చేశాడు కూడా.

ఇలా ఎడిటర్‌కి చెప్పేసి హీరో వద్దకు వెళ్లి తాను అప్పటిదాకా చేసిన తప్పులు ఒప్పుకుందామనుకుంది. కానీ ఆమె చెప్పేలోపునే హీరోకి ఎవరో చెప్పేశారు – ఆమె ఫలానా అని, నీ పేర కథనాలు వేసి నీచంగా చిత్రీకరించి, డబ్బు చేసుకుంటోంది అని. ఇది తెలియగానే హీరో హతాశుడయ్యాడు – మంచి స్నేహితురాలు అనుకున్న యీమె కూడా స్వార్థపరురాలేనా, అయ్యో అని. అతని మనసు విరిగిపోయింది. తర్వాత ఆమె వచ్చి ఏదో చెప్పబోయినా అతను వినిపించుకోలేదు. ప్రేమకథ యిలా విఫలమయింది కాబట్టి యీ ఆస్తంతా వదిలేసి, తన పల్లెటూరికి వెళ్లిపోయి వుందామనుకున్నాడు.

అతను ఆ సన్నాహాల్లో వుండగా ఇంతలో అతన్ని ఓ రైతు ఎదుర్కొన్నాడు. అప్పట్లో అమెరికాను ఆవరించి వున్న ఆర్థికమాంద్యం వలన మేమంతా దెబ్బ తిన్నాం. నీకు హఠాత్తుగా యింత కలిసి వచ్చింది కదా, కాస్త మా గురించి ఆలోచించకూడదా? అని తిట్టాడు. అతనికి అన్నం పెట్టి ఊరడించాక హీరో నిశ్చయించుకున్నాడు – తను నిరాశతో, భగ్నహృదయంతో యింత ఆస్తి యీ లాయర్ల చేతికి అప్పగించి పల్లెటూరికి వెళ్లిపోయే బదులు, యీ వూళ్లోనే వుండి ఆస్తంతా యిలాటి పేదలకు పంచిపెట్టేయాలని. పదేసి ఎకరాల చెక్కలను మూడేళ్లపాటు సాగు చేసిన కౌలుదారులకు దాన్ని వాళ్ల పేర రాసి యిచ్చేస్తానని ఓ ప్లాను ఎనౌన్సు చేశాడు. దెబ్బకి వందలాది మంది రైతులు అప్లికేషన్లతో వచ్చిపడ్డారు. క్యూలు కట్టిన వారందరికీ హీరో భోజనాలు ఏర్పాటు చేశాడు. వాళ్లంతా యితన్ని పొగిడారు.

ఇదంతా రైతులకు బాగానే వుంది కానీ లాయరు సెడార్‌కూ, పోయినాయన బంధువులకూ నచ్చలేదు. ఇంత ఆస్తి ఎటూ కాకుండా పోవడం, దానిపై తమ అజమాయిషీ పోవడం అస్సలు రుచించలేదు. ఇలా రైతులకు పంచడం తలతిక్క పని అనుకున్నారు. వాళ్లంతా కలిసి యితనికి పిచ్చెక్కిందని ప్రచారం చేశారు. కేసు పెట్టారు. పిచ్చివాడని కోర్టునుంచి అరెస్టు వారంటు తెచ్చి అరెస్టు చేయించి పిచ్చాసుపత్రిలో



పడేశారు. తన వల్లనే యింత అనర్థం జరిగిందని కుమిలిపోయిన హీరోయిన్ హీరోని కలవబోయింది. కానీ అతను ఎవరినీ కలవడానికి యిచ్చగించలేదు. కోర్టులో తన తరఫున వాదించడానికి వకీలు కూడా అక్కరలేదన్నాడు. రైతులందరూ అతని వక్షాన నిలబడడానికి కోర్టుకి వచ్చారు.



లాయర్ సెడార్ హీరో పిచ్చిచేష్టలు ఏకరువు పెట్టాడు. రైతులకు యిలా ఆస్తి పంచితే దేశం అల్లకల్లోలమై పోతుందన్నాడు. ఎనిమిది మంది సాక్షులు వంత పాడారు. ఇతను మెట్ల రెయిలింగ్‌పై జర్రున జారడం దగ్గర్నుంచి, అర్ధరాత్రి ఊళ్లలో సంచారాల దగ్గర్నుంచి అన్నీ అతనికి వ్యతిరేకంగా వుపయోగించబడ్డాయి. హీరోయిన్ రాతలు వాళ్లకు బాగా పనికి వచ్చాయి.

తెలుగు సినిమాలో హీరో జైల్లో పడ్డాక అతని పెంపుడు చెల్లెళ్లు హీరో చెల్లెళ్లు హీరోయిన్ వద్దకు వెళ్లి యిలా హీరో జైల్లో పడ్డాడని చెప్పారు. హీరోయిన్ తనకు కుదిర్చిన పెళ్లి మానేసి వెంటనే యీ వూరు వచ్చింది. పిచ్చాసుపత్రిలో డాక్టరు హీరోని కలవనివ్వలేదు. హీరోని తను అపార్థం చేసుకున్నానని తెలుసుకుంది. హీరో ఆస్తిపై కన్నేసిన బంధువుల కుట్ర గురించి పోలీసు అధికారిని కలిసి వివరించింది. కానీ అదే టైముకి హీరో పిచ్చాసుపత్రిలోంచి పారిపోయి రమణారెడ్డిని ఎటాక్ చేసి తుపాకీ లాక్కుని పోలీసులకు చిక్కకుండా పారిపోవడంతో కేసు జటిలమై పోయింది.

బయటకు వచ్చిన హీరోని పిచ్చివాడని అంతా రాళ్లు వేసి కొట్టారు. హీరో పారిపోయాడు. బీదవాడిగా వుండగా హోటల్ ద్వారా పదిమందికి అన్నం పెట్టిన అతను యీ రోజు డబ్బు వచ్చాక ఆకలితో అల్లాడాడు. జనానికి దూరంగా ఒంటరిగా బాధపడుతూ, భయపడుతూ వుండిపోయాడు. హీరోయిన్ వచ్చి హీరోకి ధైర్యం చెప్పింది. తప్పేమీ చేయనప్పుడు నీకెందుకు భయం? పద పోలీసు స్టేషన్‌కి వెళదాం అంది. హీరో ఆమె చెప్పినదానికి ఒప్పుకున్నాడు. ఇలా హీరోయిన్ పాత్రను తెలుగువాళ్లు బాగా ఎలివేట్ చేశారు. హీరో, హీరోయిన్లు పోలీసు స్టేషన్‌కి పోలీసు స్టేషన్‌లో

సూర్యకాంతం, రమణారెడ్డి పోలీసు అధికారి నాగయ్య వద్ద తెలివిగా వాదించి అతన్ని పిచ్చివాడిగా చూపించి హీరో ఆస్తికి సంరక్షకుడిగా రమణారెడ్డిని నియమించేట్టు చూసుకుంటున్నారు. తనకి వచ్చినదాంట్లో సగం యిస్తానని సూర్యకాంతాన్ని మభ్యపెట్టి రమణారెడ్డి ఆమె కూడా తనకు వత్తాసు పలికేట్టు చూసుకున్నాడు.



అప్పుడు హీరోయిన్ వారందర్ని ఖండించింది. వారి మోసాన్ని బయటపెట్టింది. హీరో తనను పిచ్చివాడని అంటున్నవారికే డబ్బు పిచ్చని అద్భుతంగా వాదించాడు. తను చేసిన మంచి పనులకు వీళ్లు ఎటువంటి విపరీతార్థాలు తీశారో, డబ్బు అంటే ఎలా పడిఛస్తారో తెలివిగా నిరూపించాడు. పోలీసు అధికారికి నమ్మకం కుదిరింది – యితనికి పిచ్చి లేదని. అసలు విల్లు ప్రకారం హీరోకి ఆస్తే రాదని రమణారెడ్డి, సూర్యకాంతం వాదిస్తూంటే మళ్లీ గందరగోళం ఏర్పడింది.

ఇంతలో వీళ్లు బనాయించిన దొంగ విల్లు సంగతి పద్మనాభం చాటుగా విని శారద సహాయంతో ఎత్తుకుని వచ్చి పోలీసులకు యిచ్చాడు. దాంతో బండారం బయటపడింది. ఇంటి దొంగలు జైలుకి వెళ్లారు. ఇంత చేసినా హీరో హీరోయిన్లు పెళ్లయ్యాక జైలుకి వచ్చి పెద్దవాళ్ల ఆశీర్వాదం తీసుకున్నారు. పద్మనాభం, శారద పెళ్లి చేసుకుని వాళ్లూ ఆశీర్వాదానికై వచ్చారు. పద్మనాభానికి ఆస్తిలో సగం వాటా యిస్తానన్నాడు ఉదార హృదయుడైన హీరో. కథ సుఖాంతమైంది.

ఇప్పుడు ఇంగ్లీషు సినిమా క్లయిమాక్స్ చూద్దాం. హీరోని పిచ్చివాడిగా చూపించడానికి కోర్టులో జరుగుతున్న నాటకం చూసి హీరోయిన్ మొత్తుకుంది. "అతన్ని కేసులో అన్యాయంగా యిరికిస్తున్నారు. ఈ పాపంలో నాకూ భాగం వుంది" అంది. "నేను అతన్ని ప్రేమిస్తున్నాను. అతను మంచివాడు, పిచ్చివాడు కాదు" అంది. తమ పక్షాన న్యాయం చేయబోయిన హీరోపై గౌరవం పెంచుకున్న రైతులు కూడా అతని పక్షాన నిలబడ్డారు. ఇదంతా చూసి హీరోలో మార్పు వచ్చింది. తన ఫిలాసఫీని అత్యంత

ప్రతిభావంతంగా వినిపించాడు. తన చేష్టల్లో ఏదీ అసహజం కాదన్నాడు.



డబ్బు ఒకచోట పేంట వేసుకుని పోవడం వల్లనే యిన్ని అనర్థాలు వస్తున్నాయని, మనుషుల్లో స్వార్థాలు పెరుగుతున్నాయనీ, డబ్బుకోసం గడ్డి తింటున్నారని అందరికీ పంచితే యీ గొడవలు రావని వాదించాడు. ఇదంతా విని జడ్జీ ఇంప్రెస్ అయ్యాడు. తన తీర్పులో హీరోని మెచ్చుకున్నాడు. కేసు కొట్టేసాడు. రైతులందరూ హీరోని హీరో చేసేశారు. భుజాల మీద ఎత్తుకుని మోశారు. హీరో, హీరోయిన్‌ని క్షమించాడు. వాళ్లిద్దరూ ఏకమయ్యారు. ఇదీ సుఖాంతమే.

ఇంగ్లీషు సినిమా పాశ్చాత్య దేశాల్లో భయంకర ఆర్థికమాంద్యం రోజుల్లో వచ్చింది. అందువలన హీరో పేదలకు భూమి పంచాలన్న ఆదర్శాలు వల్లిస్తుంటే ప్రేక్షకులు పులకించి పోయారు. హీరో తలితండ్రుల పేర్లు ఏసుక్రీస్తు తలిదండ్రుల పేర్లే పెట్టి ఇతను కూడా ఏసు వంటి రక్షకుడే, ఉద్ధారకుడే (మెస్సయ్య) అని సూచించాడు దర్శకుడు. పల్లెటూరి స్వచ్ఛతతో అతను చేసిన మంచిపనులకు పట్నవాసులు ఏ విధంగా వక్రభాష్యం చెప్పి తమ స్వలాభం కోసం అతన్ని పిచ్చివాడని ముద్ర వేసిన వారందరినీ అసహ్యించుకుని హీరోని తమ అక్కున చేర్చుకున్నారు. ఇంగ్లీషు సినిమా బ్రహ్మాండమైన హిట్ అయింది. దాన్ని యిటీవలే "మిస్టర్ డీడ్స్" అనే పేరుతో రీమేక్ చేశారు కూడా. తెలుగు సినిమా కూడా హిట్టయింది. పాటలు కూడా చాలా బాగుంటాయి. దీన్ని డైరక్టు చేసిన ఆదుర్తి సుబ్బారావు గారే దరిమిలా 'జ్వార్ భటా' (ఆటుపోట్లు) అనే పేరుతో ధర్మేంద్ర హీరోగా హిందీలో మళ్లీ తీశారు. అది పెద్దగా ఆడలేదు.

ఇదీ 'దాగుడు మూతలు' సినిమా మూల కథ.



# ఖైదీ

మన సినిమారంగం కథల గురించి అన్వేషించినపుడు విదేశీ చిత్రాల వైపు కూడా చూస్తుంది. అయితే అక్కడి వాతావరణం వేరు, చారిత్రక నేపథ్యం వేరు. దాన్ని మన అనువుగా మార్చుకోవడంలోనే మనవాళ్ల ప్రజ్ఞ కనబడుతుంది. ఉదాహరణకి చిరంజీవి హీరోగా వచ్చిన "ఖైదీ" అనే 1983 నాటి సినిమాకు ఆధారం అంతకు ఏడాది క్రితం సిల్విస్టర్ స్టాలోన్ హీరోగా యింగ్లీషులో వచ్చిన "ఫస్ట్ బ్లడ్". అయితే ఫస్ట్ బ్లడ్‌లో హీరోకి వియత్నాం యుద్ధనేపథ్యం వుంది. మరి అది మనకు నప్పదు కదా. మనకు అటువంటి సంఘటనలు ఏమీ జరగలేదు. అందుకని హీరోకు ప్రేమ నేపథ్యం పెట్టారు. ఇంగ్లీషు సినిమాలో అడపాత్రలే లేవు. మనకు హీరోయిన్, సైడ్ హీరోయిన్, అక్క యిలా చాలామందిని పెట్టి ఫ్యామిలీ సినిమాగా మలచారు. ఆ మార్పులు ఎంత అందంగా చేశారో చూద్దాం.




"ఫస్ట్ బ్లడ్" సినిమాలో హీరో అమెరికన్. అతను వియత్నాం వార్ వెటరన్. అమెరికా యిటీవల యిరాక్‌లో జోక్యం చేసుకున్నట్టే 1950 ప్రాంతాల్లో వియత్నాం గొడవల్లో తలదూర్చింది. కొన్ని వందల సంవత్సరాలపాటు వియత్నాంను వలసరాజ్యంగా పాలించిన ఫ్రెంచ్‌వాళ్లు

అక్కడ స్వాతంత్ర్యపోరాటాన్ని అణచలేక 1954లో తప్పుకున్నారు, యిలా వదిలేస్తే అది కమ్యూనిస్టు రాజ్యం అయిపోతుంది అంటూ అమెరికావాళ్లు రంగంలోకి దిగి తమ సైన్యాన్ని తోలారు. స్వాతంత్ర్య వీరులు వియత్నాం అడవుల్లో అమెరికన్ సైనికులను కుక్కల్ని వేటాడినట్టు వేటాడారు. అడవుల్లో గోతులు తవ్వి, లాండ్ మైన్స్ పెట్టి, చంపి పారేసేవారు. అమెరికన్ ప్రజలకు ఆ యుద్ధం యిష్టం లేదు. సైన్యంలోకి ఎవరూ చేరేవారు కారు. అయినా పాలకుల మూర్ఖత్వం కొద్దీ 1959 నుండి 1975 వరకు ఆ యుద్ధాన్ని కొనసాగించారు. యువకులను నిర్బంధంగా సైన్యంలోకి చేర్పించి వియత్నాంకు పంపేసేవారు. అక్కడ వాళ్లు నానా బాధలూ పడేవారు.

ఇన్ని బాధలు పడినా యుద్ధం గెలవలేదు. అందువల్ల 1975లో యుద్ధవిరమణ జరిగి స్వదేశానికి తిరిగి వచ్చాక వాళ్లను అమెరికన్ ప్రజలు యీసడించుకున్నారు. పరాజితులను ఎవరూ ఆదరించరు కదా. వీళ్లు తిరిగివచ్చాక జనజీవితంలో యిమడలేకపోయారు. యుద్ధస్మృతులు వెంటాడి వాళ్లలో చాలామంది వున్మాదస్థితికి చేరుకున్నారు. ఒరిజినల్ సినిమాలో హీరో జాన్ రాంబో కూడా వియత్నాం యుద్ధబాధితుడే. అతన్ని వియత్నాం కమ్యూనిస్టులు ఖైదీగా పట్టుకుని కాన్సన్‌ట్రేషన్ క్యాంప్‌లో అష్టకష్టాలు పెట్టారు. అవమానించారు. అతను 1971లో ఆ క్యాంప్‌నుండి పారిపోయి వచ్చాడు. తన మానాన తను బతుకుతూ ఏకాకియై వూళ్లు పట్టుకుని తిరుగుతుండగా సినిమా ప్రారంభమవుతుంది.




అతనికి యుద్ధంలో తనతో పనిచేసిన స్నేహితులు తప్ప నా అన్నవాళ్లు ఎవరూ లేరు. పాతస్నేహితుణ్ని కలుద్దామని ఒక వూరు వెళితే అతను కాన్సర్‌తో గత ఏడాది పోయాడని తెలిసింది. అలా అలా తిరుగుతూ కొండల మధ్య వున్న హోప్ అనే వూరికి వచ్చాడు. ఊళ్లోకి వస్తూండగానే ఆ వూరి షెరీఫ్ కలిశాడు. షెరీఫ్ అంటే ఆ వూరి శాంతిభద్రతలు కాపాడే అధికారి అన్నమాట. దేశద్రిమ్మరిలా వున్న ఇతని వాలకం





చూస్తే అతనికి నచ్చలేదు. జీపు ఎక్కించుకుని తిట్టాడు. ప్రశాంతంగా వున్న ఈ వూరికి రావద్దు, వేరే ఎక్కడికైనా పో అంటూ వూరి బయట దింపి పొమ్మన్నాడు. హీరోకి ఆ వూళ్లో పనేం లేదు. అయినా వీడి ధాష్టీకం చూసి ఒళ్లుమండింది. వెనక్కి తిరిగి వచ్చాడు. దాంతో షెరీఫ్‌కు ఒళ్లుమండి అతన్ని దుస్తులను సోదా చేశాడు. కత్తి కనబడింది. అరెస్టు చేశాడు.

తెలుగు సినిమా కూడా యిలాగే మొదలైంది. అంటే ఇంకో వూరికి వెళ్లి కాన్సర్‌తో పోయిన మిత్రుడి గురించి వాకబుతో కాదు. ఒక ఊరిలోకి హీరో రాబోవడం, సర్కిల్ యిన్‌స్పెక్టర్ రంగనాథ్ చూసి వేధించి తిరిగి వెళ్లిపొమ్మనడం... కత్తి చూసి అరెస్టు చేశాడు. పోలీసు స్టేషన్‌కి లాక్కెళ్లాడు. పోలీసు స్టేషన్‌లో జరిగిన సంఘటనలన్నీ – క్షవరం చేయడానికి వచ్చిన మంగలి కత్తి చూడగానే తనను ఎద్దు బండి కాడికి కట్టి ఛాతీపై గాట్లు చేయడం గుర్తుకు రావడం.. యివన్నీ – ఒరిజినల్‌లోనుండి మక్కికి మక్కి దింపేశారు. ఎన్ని హింసలు పెట్టినా పోలీసుస్టేషన్‌లో యితను నోరు విప్పలేదు. అతన్ని అనుమానించి అవమానించారు. ఆ అవమానాలు అతనిలో పాత గాయాల్ని రేపాయి. గతంలో యిలాటి అవమానాల్నే అతను ఎదుర్కొన్నాడు. ఒరిజినల్ సినిమాలో యీ హింసలన్నీ అమెరికన్ సైనికుడుగా అతను వియత్నాంలో యుద్ధం చేస్తూ వియత్నాం విప్లవకారులకు చిక్కినపుడు వాళ్లు జరుపుతారు.

తెలుగు సినిమాలో వియత్నాం యుద్ధం ప్రస్తావన లేదు కాబట్టి విలన్లు (అంటే అతను ప్రేమించిన అమ్మాయి తండ్రి, యితరులు) చేసినట్టు చూపించారు. అవి గుర్తుకు వచ్చి పోలీసుస్టేషన్‌లోంచి పారిపోయాడు. ఒరిజినల్‌లో అలా పోవడం పోవడం అడవిలోకి పోయాడు. కానీ తెలుగులో మాత్రం రంగనాథ్ చేసిన గాయం వలన హీరో

ఓ యింటి కాంపౌండులో పడిపోయాడు. ఆ యిల్లు సుమలతది. అమె డాక్టరు. యితని గతమేమిటో అడగకుండానే అతన్ని రక్షించింది. రెండు రోజులపాటు తన యింట్లోనే ఆశ్రయం యిచ్చింది. పోలీసులు అతని ఫోటో పేపర్లో వేసిన తర్వాత అతని గతం గురించి అడిగితే అతను తన కథ చెప్పాడు. ఇంగ్లీషులో వున్న యుద్ధనేపథ్యాన్ని తెలుగులో ఎలా మార్చారో చూద్దాం.

హీరో ఓ పేద పల్లెటూరి కుర్రవాడు. హీరోయిన్ ఆ వూళ్లోనే వున్న మోతుబరి రావు గోపాలరావు కూతురు. ఇద్దరూ కాలేజీలో చదువుతూ ప్రేమలో పడ్డారు. కానీ తమ మధ్య పెళ్లి అసంభవం అని ఆ అబ్బాయి చెప్తూనే వున్నా ఆ అమ్మాయి వినలేదు. తండ్రిని అడిగి చూసింది. అతను కుదరదని చెప్పడంతో బాటు హీరో కుటుంబాన్ని సర్వనాశనం చేయాలని పగ బట్టాడు. హీరో తండ్రి తనకు గతంలో బాకీ వున్న కారణంగా యిల్లు వేలం వేయించాడు. వాళ్ల కుట్ర తెలుసుకుని నిలదీయబోతే అతన్ని చంపేసి, ఆత్మహత్యగా బనాయించాడు. అంతేకాదు, శవాన్ని దహనం చేయాలంటే హీరో తన పొలాన్ని కౌలుకి తీసుకుని బాకీ తీర్చాలని పట్టుబట్టాడు.

హీరో, అతని వితంతువు అక్క కలిసి పొలం దున్నారు. హీరోయిన్ వాళ్లకి సాయపడింది. కానీ విలన్లు వదిలిపెట్టలేదు. పంట చేతికొచ్చే సమయానికి అరటిగెలలు కొట్టేసుకుని వాళ్లు అమ్మేసుకున్నారు. జరిగిన అన్యాయానికి హీరోయిన్ ప్రతీకారం తీర్చుకోమంది. తీర్చుకుందును గానీ నేను జైలుకెళితే అక్కగతి ఏమిటి? అన్నాడు హీరో. అది విన్న హీరో అక్క తను అడ్డు తొలగాలని నిశ్చయించుకుంది. తనంటే మోజు పడుతున్న మునసబు నూతన్ ప్రసాద్ వద్దకు వెళ్లి పెళ్లి చేసుకోమంది.

అతను విలన్‌కు కుడిభుజం. స్త్రీలోలుడు. మొదటిభార్యను చంపేసినవాడు. అయినా సరేనంది. వాడు అనుకున్నదాని కంటె తుచ్ఛుడు. ఆమెను ఫారెస్టు ఆఫీసరుకి తార్చబోయాడు. ఆమె వాణ్ని గాయపరచి పారిపోతూంటే వీళ్లు ఆమెను పొడిచేశారు. ఆఖరినిమిషంలో హీరో వచ్చాడు. ఆమె నిజం చెప్పేసి చనిపోయింది. హీరో నోరెత్తకుండా, జనాలు అతన్ని నమ్మకుండా వుండేటందుకు, విలన్లు కథ తిప్పేసారు. హీరోయే అక్కచేత వ్యభిచారం చేయించడానికి ప్రయత్నించాడని, ఆమె ఎదురు తిరిగి మునసబును పెళ్లాడడం చేత కోపంతో ఆమెను చంపేశాడనీ పోలీసులకు చెప్పారు. ఈలోగా అతన్ని అవమానించారు. పోలీసులు వస్తూండగానే ఇతను తప్పించుకుని పారిపోయాడు.



ఇది జరిగిన కొన్నాళ్లకి విలన్‌పై పగ తీర్చుకుందామని యితను తన వూరికి తిరిగివస్తూ రంగనాథ్ కంటపడ్డాడు. అందువలన తెలుగులో హీరో బొత్తిగా అమాయకుడు కాడు. అతనికి ఓ మోటివ్ వుంది. పోలీసులను తప్పించుకుని తిరుగుతున్నాడు. కానిస్టేబుళ్లలో ఒకడు యితన్ని గుర్తుపట్టాడు కూడా. కానీ ఒరిజినల్‌లో హీరోకి ఆ వూళ్లో ప్రవేశించేటప్పుడు ఏ దురుద్దేశమూ లేదు. పోలీసు మోటుప్రవర్తన వల్లనే అతను అడవిలోకి వెళ్లి ఫైట్ చేయవలసి వచ్చింది.

తెలుగులో హీరోకి డాక్టర్ సుమలత ఆశ్రయం యిచ్చింది కదా, వాళ్లింటి ఎదురుగుండా వుండే ఓ చిన్నమ్మాయి యితన్ని చూసింది. పేపర్లో ఫోటో పడగానే తమ ఫ్యామిలీఫ్రెండైన రంగనాథ్‌కి ఆ విషయం చెప్పింది కూడా. అతను దాడి చేసేలోపున యివతల హీరోకి ఆ విషయం చెప్పేసి పారిపోమంది. హీరో పారిపోయాడు కానీ డాక్టర్‌ని పోలీసులు హింసించారు. ఆమె నూతన్ ప్రసాద్ మొదటిభార్య చెల్లెలు కాబట్టి విలన్లు ఎటువంటి వారో తెలుసు. హీరోకి సహకరిస్తానంది. అందుకని ఆమెను ఓ పాత బంగళాలో చంపివేసి ఆ నేరాన్ని హీరోపై నెట్టివేశారు. కోర్టులో హీరో నోరు విప్పలేదు. నాకీ వ్యవస్థపై నమ్మకం పోయిందన్నాడు. కాదు నిజం చెప్పమని హీరోయిన్ నచ్చచెప్పింది. కానీ విలన్లు ఇద్దరు ముష్టివాళ్లచేత దొంగసాక్ష్యం చెప్పించారు. దాంతో హీరోకి ఉరిశిక్ష పడింది.

ఒరిజినల్ సినిమాలో మధ్యలో డాక్టరు వద్ద కథ చెప్పడం, ఆమె హత్య అదేమీ వుండదు. పోలీసు స్టేషన్‌నుండి హీరో తప్పించుకుని మోటర్‌సైకిల్‌పై పారిపోయాడు. విలన్ ఐన పోలీసు అధికారి కారులో వెంటాడాడు. అనుకోకుండా అడవిలోకి చొరబడ్డాడు హీరో. విలన్ కారు బోల్తా పడింది. హీరో మోటర్‌సైకిల్ స్లిప్పయింది. కాలినడకన వేట సాగింది. విలన్ హెలికాప్టర్, పోలీసు కుక్కల్ని తెప్పించాడు. గాల్ట్ అనే పోలీసు అధికారి హెలికాప్టర్ ఎక్కి పైలట్ వారిస్తున్నా వినకుండా అక్కణ్నుంచే కాల్పులు సాగించాడు. ఈ లోపున హీరో తన దగ్గర ఎప్పుడూ వుండే చేతి కత్తితో కాన్వాస్ గుడ్డ చీల్చి ఓ చొక్కా

తయారుచేసుకున్నాడు. కాల్పుల వలన చేతికి గాయం కావడంతో భరించలేక తనను వెంటాడుతున్న హెలికాప్టర్‌పైకి ఓ రాయి విసిరాడు.



రాయితో అద్దం పగిలి పైలట్ తత్తరపడి హెలికాప్టర్ అటు తిప్పడంతో యిటువైపు అంచుమీద కూచున్న గాల్ట్ జారి కింద పడి తల పగిలి చనిపోయాడు. అతని శవం చూసి హీరో బాధపడ్డాడు. అనవసరంగా ఒకతను పోయాడేనన్న అపరాధభావనతో లొంగిపోదామనుకున్నాడు. ఎందుకైనా మంచిదని అతని రైఫిల్ తీసుకున్నాడు. తన కత్తిలో దాచుకున్న సూది దారంతో తన గాయం కుట్టుకుని, లొంగిపోతున్నానని అరిచి చెప్పాడు అయినా విలన్ వినలేదు. తన డిప్యూటీ చావుకి కారణమైనాడన్న ఉక్రోషంతో హీరోని కాల్చాడు. అతని కణతలపై దెబ్బ తగిలింది.

ఇంతలో స్టేట్ పోలీసు రంగంలోకి వచ్చారు. హీరో వియత్నాం యుద్ధవీరుడని, పేరు జాన్ రాంబో అనీ చెప్పారు. గ్రీన్ బెరెట్‌లో వున్నాడని చెప్పారు. గ్రీన్ బెరెట్ అంటే అమెరికన్ సైన్యంలోని ప్రత్యేకదళం. విదేశీ నేలపై దుర్భర పరిస్థితుల్లో అన్‌కన్వెన్షనల్ యుద్ధం చేసేందుకు ప్రత్యేకంగా తర్ఫీదు యివ్వబడిన స్పెషల్ ఫోర్సు. అది వింటూనే మిట్చ్ అనే డిప్యూటీ యింప్రెస్ అయిపోయాడు. 'అటువంటివాణ్ని మనం వెంటాడడమేమిటి, పిలిచి సత్కరించక..' అన్నాడు. విలన్‌కు అది రుచించలేదు. చనిపోయిన కొలీగ్ గాల్ట్ శవం చూపించి రెచ్చగొట్టాడు. ఒకప్పుడు గొప్పవాడేమో కానీ యిప్పుడు సైకో, ఎలాగైనా పట్టుకోవాల్సిందే అన్నాడు. కానీ వియత్నాం అడవుల్లో కంబాట్ పోరాటంలో ఆరితేరిన హీరోని ఎదుర్కోవడం సాధ్యమా? రకరకాల ట్రిక్కులతో వాళ్లందరినీ నిర్వీర్యం చేశాడు. ఎవర్నీ చంపలేదు. గాయపరచి వదిలేశాడు. చివరకు విలన్‌ను కూడా. పీకమీద కత్తి పెట్టి నా జోలికి రావద్దు. వెళ్లి నీ పని చూసుకో అన్నాడు. విలన్ పరాభవంతో రగిలిపోయాడు.

తెలుగులో హీరోకి కోర్టు ఉరిశిక్ష వేసిందని చెప్పాను కదా. తర్వాత హీరోయిన్‌కు



తెలిసింది - ముష్టివాళ్లకు డబ్బిచ్చి దొంగసాక్ష్యం చెప్పించారని. ఇంకా ఎక్కువ డబ్బిస్తాను హైకోర్టులో నిజం చెప్పండి అంది. లాయరు చేత హైకోర్టులో దావా వేయించింది. ఈమె యిలా న్యాయవ్యవస్థపై నమ్మకంతో యిలాటి మార్గాల ద్వారా ప్రయత్నాలు చేస్తోంది కానీ హీరోకి మాత్రం వీటి మీద నమ్మకం పోయింది. జైల్లోంచి పారిపోబోయి కఠినశిక్షలకు గురయ్యాడు. అయినా పట్టు వదలలేదు. హైకోర్టుకి తీసుకెళుతూంటే జీపులోంచి వురికి పారిపోయాడు. మోటార్ సైకిల్ ఎక్కి అచ్చు ఒరిజినల్‌లో లాగానే అడవుల బాట పట్టాడు, పోలీసు కుక్కల బారిన పడ్డాడు. పోలీసులు ఓ పక్కన తరుముతూంటే మరో పక్క విలన్ ఫారెస్టు ఆఫీసరుతో చెప్పి కొండజాతివాళ్లను ఉసిగొల్పాడు. వాళ్లతోనూ ఫైట్ చేశాడు.

అడవిలోంచి హీరోని బయటకు రప్పించాలని విలన్ తన కూతురి పెళ్లి తలపెట్టాడు. అతను పందిట్లోకి రాగానే పట్టుకోవడానికి పోలీసులను మఫ్టీలో పెట్టాడు. కానీ హీరోయిన్ ముష్టివాళ్ల సాయంతో పారిపోయింది. వాళ్లు అద్దెకు తిప్పే టాక్సీలో ఆమెను అడవిలో దింపారు. ముష్టివాళ్లు నిజానిజాలు గ్రహించారు. ఆమె డబ్బు యివ్వబోతే తీసుకోలేదు. మేం తప్పు చేశాం అని బాధపడ్డారు. ఆ తర్వాత ఆమె చాలా కష్టాలు పడింది. చివరకు హీరోని చేరగలిగింది. అతన్ని చట్టబద్ధమైన మార్గానికి మరలుద్దామని, పోలీసుల నుండి క్షమాభిక్ష సంపాదించి అతను సాధారణ జీవితం గడపాలని ఆమె తాపత్రయం.

ఒరిజినల్‌లో కూడా యిలాటి పాత్ర వుంది. ప్రేయసి కాదు, హీరోని ఆర్మీలోకి చేర్చుకుని, ట్రైనింగ్ యిచ్చి మూడేళ్లు కలిసి పనిచేసిన గురువు శామ్యూల్ అని వున్నాడు. అతన్ని హీరో తండ్రిలా భావిస్తాడు. అతను వచ్చి హీరోకి హాని చేయకండి అన్నాడు. 'మా బారినుండి అతన్ని రక్షిద్దామనా' అని పోలీసులు అంటే కాదు, 'కాదు, అతనిబారి నుండి మిమ్మల్ని రక్షిద్దామని చూస్తున్నాను. అత్యంత క్లిష్ట పరిస్థితులను సైతం తనకు అనువుగా మార్చుకుని పోరాడగలిగిన దిట్ట. మీరు వందమంది వున్నా అతన్ని ఏమీ చేయలేరు' అన్నాడతను.

రేడియో ద్వారా హీరోని కాంటాక్ట్ చేశాడు. లొంగిపో అని సలహా యిచ్చాడు. 'నా తప్పేమీ లేదు తొలిసారి రక్తం చిందించినది పోలీసులే..' అని అన్నాడు హీరో. అది విన్న విలన్ 'ఇక నాకొదిలేయ్ నా తడాఖా చూపిస్తాను' అన్నాడు. పోరాటం ప్రారంభమైంది. హీరో ఓ సివిలియన్ కుర్రాడి వద్ద రైఫిల్ లాక్కుని అతన్ని వదిలేశాడు. ఫారెస్ట్ గార్డ్స్ కాల్చడం మొదలెట్టారు. హీరో ఒక పాడుపడ్డ గని వద్ద దాక్కుంటే దాన్ని రాకెట్‌తో కాల్చేశారు. గనిలో అతను కాలి చచ్చిపోయాడనుకుని ఫోటోలు తీయించుకున్నారు.

విలన్ అక్కడకు వచ్చి ఏడ్చుకున్నాడు. హీరోని ప్రాణాలతో పట్టుకుని హింసిద్దామనుకున్నాడు పాపం, అనవసరంగా చంపేశారే అని మొత్తుకున్నాడు. శామ్యూల్ మాత్రం 'అతను అంత సులభంగా చనిపోయే రకం కాదు. ఎక్కడో అక్కడ బతికే వుంటాడు' అని అన్నాడు. అతను ఊహించినదే కరక్టు. గని ముఖం ద్వారా పేలుడు జరగబోయేందుకు కాస్త ముందు హీరో ఆఖరినిమిషంలో తప్పుకుని గనిలోపలకి వెళ్లిపోయాడు. అక్కడ దివిటీ వెలిగించుకుని గనిలోంచి నడుస్తూ వెళ్లి అడవి చివరకు చేరుకున్నాడు. గనిలోంచి బయటపడి కింద నున్న రోడ్డు మీద వెళుతున్న ఓ మిలటరీవ్యాన్‌పైకి వురికాడు. డ్రైవర్ని బయటకు నెట్టేసి వ్యాన్ నడుపుకుంటూ ఊరిమీద పడ్డాడు.

తెలుగు సినిమాలో హీరోయిన్ హీరోని కలిసి అతన్ని కన్విన్స్ చేయబోయింది – 'పగ చంపేసుకో. కోర్టు కెళదాం. విడుదల అవుతావు' అని. నాకు నమ్మకం లేదని హీరో తెగేసి చెప్పాడు. ఇవతల ముష్టివాళ్లను యింటరాగేట్ చేసి విషయాలు తెలుసుకున్న యిన్‌స్పెక్టర్ రంగనాథ్ దివిటీలతో అడవిని చుట్టుముట్టాడు. తనతో వుంటే హీరోయిన్‌కు ప్రమాదం అని భావించి హీరో హీరోయిన్‌ను ఒంటరిగా వదిలిపెట్టి అడవుల్లోకి వెళ్లిపోయాడు. పోలీసులు ఆమెను యిల్లు చేర్చారు. విలన్లు బస చేసిన గెస్ట్‌హౌస్‌పై హీరో



దాడి చేశాడు. గతంలో అక్కను రేప్ చేయబోయిన ఫారెస్టు ఆఫీసరును చంపాడు. మునసబు పని కూడా పట్టాడు. గతంలో పరిచయమైన డాక్టర్ సుమలత ఎదురింటమ్మాయి రోశిని అడ్డుపెట్టుకుని పోలీసుల బారినుండి పారిపోయాడు. ఊళ్లోకి వచ్చాడు. ఇక్కడ యుద్ధం జరుగుతోంది అందరూ వెళ్లిపోండి అని చాటింపు వేయించాడు.

ఒరిజినల్ సినిమాలో వూళ్లోకి వచ్చిపడిన హీరో తన సత్తా చూపించాడు. వాన్‌లో వున్న మెషిన్‌గన్ పట్టుకుని పోలీసు స్టేషన్ చుట్టూ వున్న పెట్రోలు బంక్‌ను, గన్‌షాపును కాల్చిపారేశాడు. కరంటు, టెలిఫోన్ సౌకర్యం లేకుండా పోలీసు స్టేషన్‌ను అష్టదిగ్బంధం చేశాడు. పోలీసు స్టేషన్‌ను కూడా ధ్వంసం చేశాడు. ఇదంతా చూసి ఏదో వూడబొడుద్దామని పోలీసు స్టేషన్ టెర్రేస్‌పైకి ఎక్కికూచున్న విలన్‌కు మతిపోయింది. చివరకు అతని ప్రాణాలకే ముప్పు వచ్చింది. హీరో విలన్‌ను చంపబోయాడు కానీ సమయానికి శామ్యూల్ అడ్డుపడ్డాడు. లొంగిపో అని హితవు చెప్పాడు. బయటకు తీసుకెళ్లి చుట్టూ 200 మంది పోలీసులున్నారు. నువ్వు తప్పించుకోలేవు అని నచ్చచెప్పాడు. జరిగినది మర్చిపో అని అనునయించాడు.

అతని మాటలకు హీరో కరిగిపోయాడు. ఏడ్చాడు. యుద్ధంలో తను పడిన కష్టాలు, తర్వాత యిక్కడ ఎదుర్కొన్న అవమానాలు, తన స్నేహితులు కూడా ఒకరొకరు చనిపోవడం అన్నీ చెప్పుకున్నాడు. మనోవేదన బయటకు కక్కిన తర్వాత శాంతించాడు. శామ్యూల్ చెప్పినట్టే అతని పర్యవేక్షణలో లొంగిపోయాడు. అతన్ని కష్టపెట్టిన విలన్ పూర్తిగా గాయపడి యాంబులెన్స్‌లోకి తరలింపబడుతూండగా సినిమా ముగుస్తుంది.

తెలుగులో ఊరంతా ఖాళీ అయింది. లొంగిపొమ్మని హీరోని పోలీసు ఉన్నతాధికారి



హెచ్చరించాడు. రంగనాథ్, రావు గోపాలరావులను తనకు అప్పగిస్తే లొంగిపోతానని హీరో అన్నాడు. ఇంతలో ఎస్పీ వచ్చి ఏమిటిదంతా అంటూ వుండగానే హీరో మాయమయ్యాడు. హీరోయిన్ వచ్చి హీరోతో లొంగిపో అని అనునయించబోయింది. అతను మెత్తబడబోయాడు కానీ విలన్‌లు మాత్రం అతన్ని తుదముట్టించడానికే నిర్ణయించుకున్నారు. అది గమనించిన హీరో విలన్ని కాల్చేసి లొంగిపోయాడు. 'నీ ప్రేమకోసం మరో జన్మ ఎత్తుతా, పగకోసమే యీ జన్మ' అని హీరో హీరోయిన్‌తో అనడంతో సినిమా ముగుస్తుంది.

ఈ విధంగా దుఃఖాంతం చేసినా "ఖైదీ" సినిమా చిరంజీవి గారి కెరియర్‌లో ఓ మైలురాయిగా నిల్చిపోయి ఆయన్ని మెగాస్టార్ చేసింది. పాటలు, నృత్యాలు, అడవిలో ఫైట్స్ యివన్నీ విజయానికి ఎంతో సహకరించాయి. ఇంగ్లీషు ఒరిజినల్‌కు డైరక్షన్ టెడ్ కోచెఫ్ దైతే తెలుగులో కోదండరామిరెడ్డి గారిది. డేవిడ్ మారెల్ రాసిన నవల ఆధారంగా ఇంగ్లీషు సినిమా తీస్తే దాన్ని యిన్‌స్పిరేషన్‌గా తీసుకుని తెలుగులో చాలా కథ అల్లుకున్నారు. లోకల్ కలర్ చాలా అద్దారు. ఇదీ "ఖైదీ" సినిమా అసలు కథ.



# వర్షం

సినిమా కథ తయారుచేయడం చాలా కష్టమైన పని. నిర్మాత, దర్శకుడు నిరంతరం కథలకోసం అన్వేషిస్తూనే వుంటారు. కొత్తా, పాతా తెలుగూ, హిందీ, ఇంగ్లీషు చిత్రాలను కూడా చూస్తూ వుంటారు. దేనిలోనో ఓ పాయింటు నచ్చుతుంది. అది పెట్టుకుని కొత్తగా కథ అల్లుకుంటారు. సినిమా తీసే సమయానికి మారిన ట్రెండ్స్‌ను, స్థానిక పరిస్థితులను మనసులో పెట్టుకుని కథ తీర్చి దిద్దుకుంటారు. సందర్భం బట్టి పాత్రల స్వభావాలను మారుస్తారు. కొత్త పాత్రలను కలుపుతారు. రెండేసి మూడు పాత్రలను ఒకే పాత్రగా మార్చేస్తారు. ఇలా మార్పులు చేసినవాటిని కాపీ సినిమాలనకూడదు. ఇన్‌స్పిరేషనల్ సినిమాలనాలి. చాలా జాగ్రత్తగా చూస్తే మూలానికి, యీ కొత్త చిత్రానికీ పోలిక కనబడదు. హారంలో దారంలా ఎక్కడో ఒదిగి వుంటుంది. ఆ పోలికను వెతికి పట్టుకుని, రెండింటినీ పోల్చి చూసినపుడు 'అబ్బ, ఏం క్రియేటివిటీరా బాబూ' అని మెచ్చుకోబుద్దేస్తుంది. అలాటి ఓ మంచి ప్రయత్నాన్ని యిప్పుడు పరామర్శిద్దాం.




'వర్షం' అనే 2004 నాటి తెలుగు సినిమా, 'తేజాబ్' అనే 1988 నాటి హిందీ సినిమా వలన యిన్‌ఫ్లుయెన్సు అయిందని చెప్పవచ్చు. రెండింటిలోనూ మూలసూత్రం ఒక్కటే. ఒక కళాకారిణి, ఆమె కళను సొమ్ము చేసుకుని పరాన్నభుక్కులా ఆమెపై బతికేద్దామని చూసే ఆమె తండ్రి, ఆ తండ్రి కిచ్చిన అప్పులు వసూలు చేసుకోవడానికై విలన్ ఆమెను కిడ్నాప్ చేయడం, ఆమెను

ప్రేమించి అపార్థాల వలన దూరమైన ఆమె ప్రియుడు ఆమెను కిడ్నాప్‌నుండి రక్షించి, అల్టిమేట్‌గా పెళ్లాడడం.

ఈ మాలకథకు హిందీవాళ్లు అమర్చిన హంగులు వేరు. 16 యేళ్ల తర్వాత తెలుగులో తీసినపుడు తెలుగువారు చేసిన అలంకారాలు వేరు. రెండు సినిమాలూ కిడ్నాప్‌తోనే ప్రారంభమవుతాయి. తేజాబ్‌లో తండ్రి ఒత్తిడికి లొంగి ఏక్, దో, తీన్ పాటకు హీరోయిన్ మాధురీ దీక్షిత్ డాన్సు చేస్తూండగా పఠాన్ అనే విలన్ (కిరణ్ కుమార్) ఎత్తుకుపోతాడు. తెలుగులో విలన్ గోపీచంద్ సినిమా షూటింగులో వున్న హీరోయిన్ త్రిషను ఎత్తుకుపోతాడు. అక్కణ్నుంచి తెరపై గంటా గంటన్నర పాటు ఫ్లాష్‌బ్యాక్‌ల్లోకి వెళతాయి. మొదట హిందీ సినిమా కథ చూద్దాం.

దీనిలో హీరో మహేష్ దేశ్‌ముఖ్. పాత్రధారి అనిల్ కపూర్. నాసిక్‌లో వుంటాడు. తండ్రి, తల్లి బాంక్‌లో పనిచేస్తూ వుంటారు. ఇతను కాలేజీలో నేవీలో కప్ గెలుచుకున్నాడు. తండ్రికి చూపడానికి వచ్చాడు. అప్పుడు అక్కడే వున్న ఎస్సై అడిగితే నేవీ అడ్మిరల్ అయి దేశసేవ చేయడమే నా ధ్యేయం అన్నాడు. వీళ్లు బయటకు వచ్చేస్తూంటే బాంక్ దోపిడీ జరిగింది. హీరో తలిదండ్రులు చనిపోయారు. ఇతను వీరోచితంగా పోరాడితే ఎస్సయి ఎంతో గర్వించాడు. తలిదండ్రులు చనిపోయాక హీరో తన చెల్లెలితో సహా బొంబాయి వచ్చి కాలేజీలో చేరాడు. అక్కడ తన సోదరి క్లాస్‌మేట్ అయిన హీరోయిన్‌ను అంటే మాధురీ దీక్షిత్‌ను ప్రేమించాడు.

ఈ హీరోయిన్‌ది ఓ విషాద గాథ. ఆమె తల్లి మంచి డాన్సర్. తండ్రి అనుపమ్ ఖేర్ తబలా వాయించేవాడు. ఇద్దరి మధ్యా ప్రేమ జనించింది. పెళ్లి చేసుకున్నారు. పోనుపోను తండ్రి తాగుబోతు అయిపోయి భార్య డాన్సు మీద సంపాదించినదంతా ఖర్చు పెట్టడం మొదలుపెట్టాడు. ఇంకా యింకా డాన్సు చేయమని బలవంత పెట్టేవాడు. ఓ నాడు తల్లి ఎదురు తిరిగింది. కూతురుతో సహా ఇంట్లోనుండి వెళ్లిపోతానంది. తండ్రి యాసిడ్ బాటిల్ చూపించి బెదిరించాడు. నీ మొహం నాశనం చేస్తానన్నాడు.



అప్పుడు జరిగిన తోపులాటలో అనుకోకుండా ఆమె మొహంపై యాసిడ్ పడి వికృతమై పోయింది. ఆ రాత్రే ఆమె ఆత్మహత్య చేసుకుంది.

ఇక అప్పుణ్నుంచి తండ్రి కూతుర్ని డాన్సు నేర్చుకోమని ఒత్తిడి చేయనారంభించాడు. భార్య పోయింది కాబట్టి యీమె డాన్సు మీద వ్యాపారం చేద్దామని అతని ఐడియా. ఈ లోపున అతని తిండి తాగుడుకై భారీగా అప్పులు చేస్తున్నాడు. డాన్సు చేయడానికి ఆమె మొండికేస్తోంది. ఆర్నెల్లలో షో చేయకపోతే చంపుతానంటున్నాడు. వీపుమీద వాతలు పెడుతున్నాడు. నీ తల్లిలాగానే నీ మొహంకూడా యాసిడ్‌తో కాల్చేస్తా అంటున్నాడు.

హీరో హీరోయిన్లు ప్రేమలో పడ్డారు. మొదట్లో కాస్త అపార్థాలు కలిగినా తర్వాత సర్దుకున్నాయి. కూతురు యిలా ప్రేమలో పడడం తండ్రికి రుచించలేదు. ఆమె డాన్సరై సంపాదిస్తుందని కబుర్లు చెప్పి పఠాన్ అనే విలన్ వద్ద తన భవంతి తాకట్టు పెట్టి బోల్డు డబ్బు అప్పుగా తీసుకుంటున్నాడు. ఈమె ఎవర్నో పెళ్లి చేసుకుని వెళ్లిపోతే అతని నోట్లో కరక్కాయే! అప్పు తీసుకోవడానికి వచ్చినపుడు విలన్ తమ్ముడు తారసిల్లాడు. అతనే నాసిక్ బాంక్‌లో హీరో తలిదండ్రులను చంపి హీరో కారణంగా జైలు కెళ్లినది. జైలునుండి యిప్పుడే తిరిగి వచ్చి హీరో కోసం వెతుకుతున్నాడు.

మనిద్దరికి ఉమ్మడి శత్రువు హీరోయే అన్నాడు హీరోయిన్ తండ్రి. విలన్ తమ్ముడు హీరో చెల్లెల్ని కిడ్నాప్ చేసి రేప్ చేయబోయాడు. హీరోయిన్ ఆ విషయాన్ని హీరోకు చేరవేసింది. హీరో తన ఫ్రెండ్స్ చుంకీ పాండే వగైరాలతో అక్కడికి చేరి ఫైట్ చేశాడు. రేప్ చేయబోతున్న విలన్ తమ్ముడి నెత్తి మీద బలంగా కొట్టడంతో వాడు చచ్చిపోయాడు. కోర్టులో కేసు నడిచింది. పబ్లిక్ ప్రాసిక్యూటర్ విలన్ నుండి డబ్బు తిని హీరోకి వ్యతిరేకంగా గట్టిగా వాదించాడు. చివరకు హీరోకు ఒక ఏడాది ఖైదు శిక్ష పడింది. విలన్ అనుచరులను వదిలేశారు.



అన్నగారు జైలుకి వెళ్లడంతో ఒంటరిదై పోయిన హీరో చెల్లెల్ని విలన్ చంపించబోయాడు. కానీ హీరో స్నేహితుడు చుంకీ పాండే కాపాడాడు.

విలన్‌ను వూరినుండి తరిమేస్తే తప్ప ఆమెకు రక్షణ లేదనుకున్నాడు. అరబ్బువాళ్ల వేషాల్లో వచ్చి విలన్ జూదస్థావరాలను కనుగొన్నారు. మర్నాడు వాటిపై దాడి చేసి, పోలీసులను రప్పించారు. అతని అండర్ వరల్డ్ వ్యాపారం బయటపడి వూరొదిలి పారిపోవలసి వచ్చింది.

"తేజాబ్"ని "టూ టౌన్ రౌడీ"గా రీమేక్ చేశారు కదా, దాన్ని గురించే రాయవచ్చు కదా అని కొందరు మెయిల్స్ రాశారు. ఉన్నదున్నట్టు కాపీ కొట్టేయడమో, రీమేక్ చేయడమో చేస్తే మనం కనిపెట్టేదేముంది? దాని గురించి చర్చించేది ఏముంది? తెలుగులో తీసినప్పుడు ఏదైనా మారిస్తేనే నాకు యింట్రస్టు. ఆ ఎడాప్టేషన్ కూడా మన వాతావరణానికి తగినట్టు చేస్తే మరీ యింట్రస్టు. అందుకే "వర్షం" గురించి మాట్లాడుతున్నాను, "టూ టౌన్ రౌడీ" గురించి కాదు.

తేజాబ్ కథ కొనసాగిస్తే.. – ఈ విధంగా హీరోయిన్ తండ్రికి విలన్ అండ పోయింది. మరో పక్క హీరో జైల్లోంచి బయటకు వచ్చేస్తున్నాడు. కూతురు డాన్సు ప్రోగ్రాం మానేసి, అతనితో వెళ్లిపోతుందేమోనని తండ్రి భయం. అందువలన ఆమెను కొట్టి యింట్లో బంధించేశాడు. హీరో జైలునుండి సరాసరి యితని యింటికి వచ్చి ఆమెకోసం వెతికాడు. ఆమె చచ్చిపోయిందని చెప్పినా నమ్మలేదు, యిల్లంతా వెతికాడు కానీ దొరకలేదు. చివరకి ఆమెను వేరేచోట పోలీసు పహరాలో దాచేశాడు. కానీ టీస్టాల్ కుఱ్ఱాడు ఆమె ఆచూకీ చెప్పడంతో హీరో అక్కడకు చేరి ఆమెను వూరడించాడు. మాటల్లో తెలిసింది టీస్టాల్ కుఱ్ఱాడు తండ్రితో చేతులు కలిపాడని.

నిజమే, తండ్రి పోలీసులకు లంచం యిచ్చి టీ స్టాల్ కుఱ్ఱవాడి దొంగ సాక్ష్యంతో హీరోపై దొంగతనం కేసు మోపాడు. ఫిర్యాదు చేయడానికి పోలీసు స్టేషన్‌కు వెళ్లిన హీరోను యిన్‌స్పెక్టర్ బెల్టు తీసి చావగొట్టాడు. హీరోయిన్ యింటిపై పడి దొంగతనం చేయబోయాడని కేసు పెట్టి కూటసాక్ష్యాలు చెప్పించారు. కోర్టు అతనికి ఒక సంవత్సరం పాటు నగర బహిష్కార శిక్ష వేసింది. అతను వేరే వూరు వెళ్లిపోయి మున్నా అనే పేరుతో గూండాగా మారిపోయాడు. ఏడాది శిక్ష ఇంకో మూడు రోజుల్లో ముగుస్తుందనగా అతని చెల్లెలినుండి టెలిగ్రాం వచ్చింది వెంటనే రా అని. అతను బొంబాయి వచ్చాడు. చెల్లెలు అలా టెలిగ్రాం యివ్వడానికి కారణం ఏమిటంటే – ఊళ్లోంచి వెళ్లిపోయిన విలన్ బొంబాయికి దూరంగా ఓ పల్లె కట్టుకుని అక్కడ తన అండర్ వరల్డ్ వ్యాపారాలన్నీ చేసుకుంటున్నాడు. గతంలో యిచ్చిన అప్పు వసూలు చేసుకుని రమ్మనమని హీరోయిన్



తండ్రి వద్దకు తన మనుష్యులను పంపాడు. రేపు మధ్యాహ్నం లోగా 50 వేలు యివ్వకపోతే చంపుతామని బెదిరించారు. ఇక్కణ్నుంచి సినిమా ప్రారంభమవుతుంది.

వాళ్లకు యివ్వడానికి తండ్రి ఓ ప్లాను వేశాడు. హీరోయిన్ ప్రోగ్రాంలు స్పాన్సర్ చేసే సక్సేనాను యింకో 50 వేలు అదనంగా యిమ్మనమని డిమాండ్ చేశాడు. లేకపోతే మా అమ్మాయి రేపు ప్రోగ్రాంకి రాదు అని బ్లాక్‌మెయిల్ చేశాడు. అయితే ఆ సక్సేనా కూడా తక్కువ్వాడు కాడు. అలాగే యిస్తానని రమ్మనమని చెప్పి హీరోయిన్ ప్రోగ్రాంకు పంపించి అప్పుడు తండ్రి పని పట్టాడు. చేతిలో పెట్టిన 50 వేలు వెనక్కి లాక్కుని కట్టి పడేశాడు. అతనికి హీరోయిన్‌ను పెళ్లి చేసుకోవాలని ఆశ.

పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చిందన్నట్టు యీ గొడవల్లో విలన్ ఆమెను డాన్సింగ్ ఫ్లోర్ నుండే ఎత్తుకుపోయాడు. తండ్రి కిచ్చిన అప్పును ఆమె శరీరాన్ని అమ్మి గడిద్దామని విలన్ ప్లాన్. హీరో సోదరి యిదంతా చూసి వచ్చి హీరోకు టెలిగ్రాం యిచ్చింది. ఇక్కడివరకు జరిగిన కథను తెలుగులో ఎలా మార్చారో చూద్దాం.

తెలుగులో హీరోయిన్ త్రిష. ఆమె తల్లి సంగీత చాలా మెతకమనిషి. ఉన్నా లేనట్టే. తండ్రి ప్రకాష్‌రాజ్. హిందీ సినిమాలో లాగానే ధూర్తుడు. తాగుబోతు. పేకాటరాయుడు. ఏ పనీ పాటా లేని రికామీ బతుకు. అనేక వూళ్లల్లో వ్యాపారాలు చేసి చెడిపోయి వరంగల్‌లోని అత్తగారింటికి వెళుతున్నాడు. హీరోయిన్‌కు వర్షం అంటే ప్రాణం. రైలు ఓ స్టేషన్‌లో ఆగితే వాన పడితే పులకించిపోయి డాన్సు చేసింది. ఆ డాన్సు యిద్దర్ని ఆకర్షించింది. ఒకరు హీరో ప్రభాస్. పాలిటెక్నిక్ చదివి వరంగల్‌లోని అక్కగారింటికి వెళుతున్నాడు. మరొకరు విలన్ గోపీచంద్. వరంగల్‌లో ఓ అండర్ వరల్డ్ డాన్. అతని తండ్రి చచ్చిపోతూ ఓ వుపదేశం చేశాడు. ఆడదాని వుసురు పోసుకోవద్దని. అంతవరకూ బాగానే వుంది కానీ వుంచుకున్నదాని వలన పుట్టినవాడికి ఆస్తిలో సగం యిమ్మనమన్నాడు. దెబ్బకి విలన్‌కు ఒళ్లుమండి తండ్రిని చంపిపారేశాడు. విభీషణుడులాటి

బాబాయి అది చూసి అసహ్యించుకున్నాడు.



విలన్ తండ్రిని శ్మశానంలో దహనం చేసేటప్పుడు తండ్రి వుంపుడుగత్తె కొడుకు షఫీని అక్కున చేర్చుకున్నాడు. ఆస్తిలో నగం యివ్వలేదు కానీ జీవితాంతం నమ్మకంగా పడివుండే బానిసను సంపాదించుకున్నాడు. రైల్వే స్టేషన్లో డాన్సు చేసిన హీరోయిన్‌పై విలన్ కన్ను పడింది. అసిస్టెంట్లను కనుక్కుని రమ్మనమన్నాడు. వాళ్లు వచ్చి ఆ అమ్మాయి యీ వూరిలోనే వుందని చెప్పారు. అయితే నాకు దక్కే పద్ధతి చూడమన్నాడు. అసిస్టెంటు రఘుబాబు డబ్బు ఎర చూపించి తండ్రిని విలన్ కోటకు తీసుకుని వచ్చాడు. విలన్ ఎలాటివాడో తండ్రికి తెలిసింది. కానీ ధైర్యం చేసి అప్పు అడిగాడు. విలన్ వెంటనే యిచ్చాడు.

మొదటిసారి హీరో, హీరోయిన్లు కలిసినపుడు హీరోయిన్ కోరిక మేరకు ఆమెను తండ్రిని వెతికే క్రమంలో హీరో రైలు మిస్సయిపోయాడు. ఇక ఆమె జన్మలో కనబడుతుందో లేదో అనుకున్నపుడు వరంగల్ కూరల మార్కెట్‌లో మళ్లీ వర్షం కురిసేవేళ కనబడింది. మూడోసారి కూడా వర్షం కురిసే వేళే కనబడింది. తమ ప్రేమను వర్షం దీవించిందని నమ్మారు వాళ్లిద్దరూ. ఉంగరాలు మార్చుకున్నారు. ఇలా వుండగా ఆ వూళ్లో షూటింగ్ జరుగుతూంటే చూడబోయారు హీరో హీరోయిన్లు. హీరోయిన్‌ను చూసి యింప్రెస్ అయిన నిర్మాత ఆమెను సినిమా యాక్టర్ చేస్తానని తండ్రికి ఆఫర్ యిచ్చాడు. కానీ ఆమె 'నో' అంది. ఆ విషయం తెలిసి ప్రకాష్ రాజ్ డబ్బు గడించేందుకు సులభమైన మార్గం వుందని గ్రహించాడు. కూతురిని బ్లాక్‌మెయిల్ చేయడానికి ఫ్యూజ్ బాక్స్‌లో వేలు పెట్టేసి, చచ్చిపోతానని బెదిరించి, తల్లి తలపై వొట్టు వేయించి సినిమాలకు ఒప్పించాడు. హీరోయిన్‌కు గతి లేకపోయింది. కానీ హీరోకి యిది నచ్చలేదు. స్టిల్ ఫోటోలు తీస్తున్న వేళ వెళ్లి పరాయి మగవాళ్ల చేతిలో యీ గోల ఏల? నేను పెళ్లి చేసుకుంటాను అని హీరోయిన్‌కి చెప్పాడు.

దాంతో హీరోయిన్ హీరోని పెళ్లి చేసుకుంటానని తండ్రి ప్రకాష్‌రాజ్‌తో చెప్పింది. ఒట్టేసింది సినిమాలలో వేస్తానని తప్ప హీరోని పెళ్లి చేసుకోనని కాదుగా అంది. తండ్రి గిజగిజ లాడాడు. పెళ్లి చేసుకుంటే ఆమె సంపాదనపై హక్కు పోతుందని అతని బాధ. ఇంతలో విలన్ పిల్చి నీ కూతుర్ని నాకిస్తే 10 లక్షలు ఎదురుకట్నం యిస్తానన్నాడు. మనిద్దరి కామన్ విలన్ ఒకడే అన్నాడు తండ్రి, హిందీలో లాగానే. విలన్ హీరోని మట్టుపెట్టబోయాడు కానీ హీరోయే జయించాడు. అతన్ని అప్పుడే చంపితే హీరోయిన్ దృష్టిలో అతను హీరో అయిపోతాడు కాబట్టి అతన్ని బద్‌నామ్ చేయాలని ప్లాను వేశాడు విలన్. తండ్రి ద్వారా హీరోయిన్‌ను తెలివిగా మభ్య పెట్టాడు.



ఇక్కడివరకు హిందీ సినిమాకు, తెలుగు సినిమాకు వున్న పోలికలు, తేడాలు చూద్దాం. హీరోయిన్ తండ్రి స్వభావం ఒక్కటే. కూతురికి ఎవర్నిచ్చి పెళ్లి చేసే వుద్దేశమూ లేదతనికి. అక్కడ డాన్సులు, యిక్కడ సినిమా పోతాయన్న భయం. హిందీలో విలన్లు యిద్దరు. డబ్బు అప్పిచ్చేవాడు ఒకడు, హీరోయిన్‌పై కన్నేసినవాడు మరొకడు. ఇక్కడ యిద్దర్నీ ఒకర్ని చేశారు. హిందీలో సక్సేనాకు ఈమె డాన్సు తెచ్చే డబ్బుపై ఆశ వుంది. తెలుగు విలన్‌కి ఆ ఆశ లేదు. హిందీలో విలన్‌కు కిడ్నాప్ చేయడానికి కారణమూ ఒకటే – హీరోయిన్ తండ్రిపై కసి, డబ్బు! ఇక్కడ – హీరోయిన్ తండ్రిపై కసి ప్లస్ పెళ్లి చేసుకోవాలనే వుద్దేశం. ఇక హీరో విషయానికి వస్తే హిందీలో దేశభక్తి గల యువకుడు క్రమేపీ గూండాగా మారతాడు, హీరోయిన్ తండ్రి పెట్టించిన తప్పుడు కేసులతో. ఇక్కడి హీరో మామూలు కుఱ్ఱవాడు. తండ్రి పెట్టించిన తప్పుడు కేసులకు బలవుతాడు కానీ గూండా అయిపోడు.

హీరోయిన్ తండ్రి హీరోయిన్‌కు నచ్చచెప్పాడు. పెళ్లికి ఒప్పుకుంటాను గానీ ఆ అబ్బాయి ఏ వుద్యోగమూ చేయకపోతే ఎలా? అని. అదే మాట హీరోయిన్ అడిగింది హీరోని. అతను రోషానికి పోయి ఓ ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ మానేజర్‌గా చేరాడు. ఆ

కంపెనీ మానేజర్ యితను ఉగ్రవాది అని చెప్పి కన్ఫెషన్ యిచ్చి కేసులో యిరికించాడు. ఇదంతా విలన్, హీరోయిన్ తండ్రి కలిసి ఆడిన నాటకం అని హీరోకి తెలిసింది కానీ హీరోయిన్ అర్థం చేసుకోలేకపోయింది. తండ్రిని గుడ్డిగా నమ్మింది. నీకు యింత యిగో వుండకూడదని వాదించింది. హీరోయిన్ తన మాట నమ్మకుండా తండ్రినే విశ్వసించినందుకు హీరోకి కోపం వచ్చింది. ఊరు విడిచి వైజాగ్ వెళ్లిపోయాడు.

హీరోయిన్‌ను తండ్రి మిస్‌లీడ్ చేశాడు. వెళ్లి హీరోని బతిమాలబోతే అతను తనను కొట్టాడనీ, ఆమె యిచ్చిన వుంగరం విసిరి కొట్టాడనీ యిలా.. దాంతో హీరోయిన్‌కు మనసు విరిగిపోయింది. ఆ విధంగా హీరోయిన్ తండ్రికి హీరో పీడ విరగడైంది. విలన్‌కి బాకీ పడ్డానని ఏడుపుమొహం పెడితే అయితే సినిమాల్లో నటించి అతని అప్పు తీర్చేస్తానని హీరోయిన్ మాట యిచ్చింది. తండ్రి పరమానంద భరితుడై విలన్‌కు శఠగోపం పెట్టేసి వరంగల్‌నుండి హైదరాబాదుకి మకాం మార్చేశాడు. హీరోయిన్ అంకితభావంతో సినిమాలో పనిచేయసాగింది. దానివలన వచ్చే భోగాలు తండ్రి అనుభవిస్తున్నాడు.

ఇలా తనకు టోపీ పెట్టేసి పారిపోయిన ప్రకాష్‌రాజ్‌కు బుద్ధి చెప్పడానికి, హీరోయిన్‌ను మచ్చిక చేసుకోవడానికి విలన్ ఆమెను ఎత్తుకుపోయాడు. నిజానికి సినిమా యిక్కడ ప్రారంభమౌతుంది. ఇందాకటి కథంతా ఫ్లాష్‌బ్యాక్‌లో వస్తుంది. గోపీచంద్ వంటి రావణాసురుడి వద్దకు వెళ్లి ఆమెను క్షేమంగా తీసుకుని వచ్చేవాడెవడు? అని ప్రకాష్ రాజ్, సినిమా నిర్మాత జయప్రకాష్ అనుకుంటున్నపుడు హీరో యింట్రడక్షన్ చూపించారు. హీరో కొండల్లో డ్రిల్లింగ్ చేస్తూంటే బ్లాస్ట్ జరుగుతూంటుంది. అతని బాబాయి చంద్రమోహన్ అనుకోకుండా అక్కడికి రావడం, అతన్ని హీరో రక్షించడం చూపి హీరో డేర్‌డెవిల్ అని మొదట్లోనే ఎస్టాబ్లిష్ చేశారు. అతని బాబాయికి హార్ట్ ఆపరేషన్‌కై 3 లక్షలు కావాల్సి వచ్చింది. అందుకే నిర్మాత హీరోయిన్‌ను తీసుకురమ్మనపుడు అతను 'దానికై డబ్బు కావాలి' అని చెప్పాడు

హిందీలో కూడా యిలాటి అగ్రిమెంటుతోనే అతను బయలుదేరతాడు. హీరోయిన్ చేత డాన్సులు చేయించే సక్సేనా యిచ్చే డబ్బుకోసమే వెళుతున్నానంటాడు. నిజానికి అతనికి డబ్బు అక్కరలేదు. గూండాగా మారిపోయిన తనతో హీరోయిన్ క్షేమంగా వుండలేదనీ, ఆమెంటే యిష్టపడుతున్న సక్సేనా వంటి ధనవంతుడిని పెళ్లాడితే సుఖపడుతుందనీ అతను త్యాగం చేస్తున్నాడు. హీరోయిన్‌కోసం బయలుదేరినప్పుడు అతనికి గతంలో పరిచయమైన పోలీసు అధికారి సురేష్ ఒబెరాయ్ అడ్డుకున్నాడు.



తన కథంతా చెప్పి, వప్పించి 24 గంటల నమయం అడిగి, విలన్ గూడానికి వెళ్లాడు. అతన్ని బెదిరించి హీరోయిన్‌ను తీసుకుని వచ్చాడు. అతని వూరు తగలెట్టాడు. హీరోయిన్ సంతోషించబోతే 'నువ్వు డాన్సు చేసి సంపాదించే డబ్బు కోసమే నేను కాపాడాను' అని అబద్ధం చెప్పి ఆమె తనను అసహ్యించుకునేట్టు చేశాడు. హీరోయిన్ ఎదురుగానే సక్సేనా వద్ద డబ్బు తీసుకుని ఆమె అసహ్యాన్ని మరింత పెంచాడు.

గడువుకి ముందే వూరు వచ్చేసినందుకు హీరోపై కేసు నడిచింది. ఎస్సయి గతంలో తప్పుడు కేసు పెట్టిన పోలీసుని దండించి నిజం చెప్పించాడు. కేసు కొట్టేశారు. ఎస్సయి హీరోకి గోవాలో వుద్యోగం చూశాడు. హీరో ఒంటరిగా వెళ్లిపోదామనుకున్నాడు. హీరో అసలు వుద్దేశం తెలిసిన టీ కొట్టు కుఱ్ఱాడు హీరోయిన్ అపోహలు దూరం చేశాడు. తండ్రితో పోట్లాడి ఆమెను అతని వద్దకు పంపించేశాడు. తర్వాత తండ్రితో జరిగిన పోరాటంలో ఇద్దరూ చనిపోయారు. హీరోయిన్‌కు తండ్రి పీడ విరగడైంది. హీరో, హీరోయిన్లు కలిశారు. కానీ హీరో గోవా వెళ్లకుండానే చంపేద్దామని విలన్ అనుకున్నాడు. ఓడపై భీకరమైన పోరు జరిగింది. హీరో ఫ్రెండు ప్రాణత్యాగం చేశాడు. ఎస్సయి హీరోని సరైన సమయంలో రక్షించి, అతనిలో ద్వేషం బయటకు పోయేట్లా విలన్ని తన్నించి, మామూలు వ్యక్తిగా చేసి హీరోయిన్‌తో సహా గోవాకు పంపించి కథ సుఖాంతం చేశాడు.

తెలుగులో హీరోయిన్‌ను తనంతట తానే హీరో మంచితనం గ్రహించేట్లుగా చూపించారు. అదెలా సాగిందంటే - హీరో విలన్ కోటపై ఎటాక్ చేశాడు. తన ప్రాణం వొడ్డి హీరోయిన్‌ను కాపాడాడు. ఆమెను రక్షించడానికి ఎన్నో సాహసాలు చేసినా హీరో అంటీముట్టనట్టుగానే వున్నాడు. అతని చేతనున్న వుంగరం చూసి హీరోయిన్‌కు అర్థమైంది. తన తండ్రి తనను మోసం చేశాడని. వాళ్లు లిఫ్ట్ అడిగిన బస్సులో వున్న పెళ్లి కాబోయి విడిపోయిన జంట వుంది. అప్పటికే బుద్ధి తెచ్చుకున్న

హీరోయిన్ ఆ అమ్మాయికి హితబోధ చేసింది. చివరకు హీరోకి క్షమాపణ చెప్పుకుని చేరువైంది - వర్షం ధర్మమాని. అయితే వారిని విడదీయబోయాడు విలన్ తమ్ముడు షఫీ. అతన్ని చావుదాకా తీసుకుని వచ్చి క్షమించి వదిలేశాడు హీరో. అయితే విలన్ అతన్ని క్షమించలేదు. తన పరువు తీసినందుకు కాల్చిపారేశాడు. అమీతుమీ తేల్చుకోవడానికి హైదరాబాదు బయలుదేరాడు. ఓ జాతరలో హీరో, విలన్ ముఖాముఖీ తలపడ్డారు. హోరాహోరీ యుద్ధం జరిగింది. ఓడిపోయిన విలన్ దొంగచాటుగా హీరోని చంపబోతే రావణుడి బొమ్మ మీద పడింది. కాలి భస్మమయ్యాడు. వర్షంతో కథ సుఖాంతమైంది.




తేజాబ్ అంటే యాసిడ్. ఒక సాఫ్ట్ లవర్ బాయ్ గూండాగా మారడం, ఒక పోలీసు అధికారి సహాయంతో మంచిగా మారడం యివన్నీ పెట్టి అప్పటికి సోషల్లీ రెలవెంట్‌గా చేశారు. 16 యేళ్ల తర్వాత తెలుగు సినిమా వచ్చేపాటికి హీరో యిమేజి మారిపోయింది. రఫ్ అండ్ టఫ్ మనిషిగానే మొదటినుండీ చూపించారు. వర్షం అని పేరు పెట్టి రొమాంటిక్ చిత్రంగా తీర్చిదిద్దారు. హిందీ, తెలుగు రెండు సినిమాల్లోని పాటలూ సూపర్ హిట్. హిందీ సినిమా దర్శకుడు ఎన్ చంద్ర కాగా, తెలుగు సినిమాకు దర్శకత్వం వహించినది శోభన్. కథ వీరూ పోట్ల. మొదటే చెప్పినట్టు హిందీ సినిమాలోని ఒక అంశాన్ని తీసుకుని ఎంతో మార్చుకుంటూ వచ్చారు తెలుగులో. ఇలా చేసుకుంటే కథలకు కొరతే వుండదు. ఇదీ 'వర్షం' సినిమా అసలు కథ.

●

# క్రిమినల్

తెలుగు సినిమారంగం కథకోసం చేసే అన్వేషణలో విదేశీచిత్రాలను కూడా పరామర్శిస్తుంది. కొన్ని ఘట్టాలను యథాతథంగా తీసుకున్నా ముఖ్యపాత్రలకు కుటుంబనేపథ్యం పెట్టడం, ఉద్వేగాలను కాస్త బలంగా చూపించడం యిటువంటివి అద్ది వాటికి లోకల్ కలర్ యిస్తుంది. మరీ టెక్నికల్ విషయాలు వుంటే వాటి జోలికి పోకుండా యిక్కడ సామాన్య జనాలకు అర్థమయ్యే విధంగా కథను మలచుకుంటుంది. అలా మలచుకోవడంలో మనవాళ్లు చూపే ఒడుపులను యీ శీర్షికలో చర్చించుకుంటున్నాం.

ఇప్పుడు మనం పరామర్శించబోయే సినిమా 'క్రిమినల్'. హిందీ దర్శకుడు మహేష్ భట్ దర్శకత్వంలో నాగార్జున, మనీషా కోయిరాలా, రమ్యకృష్ణ, పోలీసు అధికారిగా నాజర్ నటించిన యీ 1994నాటి సినిమాకు ఆధారం – ఫ్యూజిటివ్ అనే 1993 నాటి సినిమా. ఇంగ్లీషు సినిమాకు దర్శకుడు ఆండ్రూ డేవిస్. హీరో హారిసన్ ఫోర్డ్. పోలీసు అధికారిగా నటించిన టామీ లీ జోన్స్‌కు ఉత్తమ సహాయనటుడిగా ఆస్కార్ బహుమతి లభించింది.




హీరో ఒక నిజాయితీపరుడైన డాక్టర్. అతని భార్య హత్య చేయబడింది. ఆ హత్యానేరం అతనిపై పడింది. సాక్ష్యాధారాలన్నీ హీరోకి వ్యతిరేకంగా వున్నాయి. కోర్టులో అతనిమాట ఎవరూ వినలేదు. మరణశిక్ష పడింది. జైలుకి వ్యాన్‌లో తీసుకెళుతుండగా అనుకోని సంఘటనలు జరిగి అతను తప్పించుకోగలిగాడు. పోలీసులు అతన్ని

వెంటాడారు. అతను తన భార్య హంతకుణ్ని వేటాడాడు. ఇదీ కథాంశం. ఫ్యూజిటివ్ అంటే చట్టాన్ని తప్పించుకుని పారిపోయేవాడు అని అర్థం. ఇంగ్లీషు సినిమా హత్యతో ప్రారంభమైంది. చిన్న చిన్న ఫ్లాష్‌బ్యాక్‌లతో జరిగిన కథ చెప్పారు. కానీ తెలుగు సినిమాలో హీరోకు, అతని భార్యకు ఎలా పెళ్లయిందో విపులంగా సగం సినిమాపాటు చూపించారు. ఇంగ్లీషు సినిమాతో మొదలెడదాం.

హీరో షికాగోలోని ఓ ప్రముఖ ఆసుపత్రిలో డాక్టర్. అతని భార్య సోషల్ వర్కర్. చిల్డ్రన్ రిసెర్చ్ ఎయిడ్ ఫౌండేషన్‌కై పార్టీలు ఏర్పాటు చేస్తూ వుంటుంది. ఓ రోజు డాక్టర్ యింటికి వచ్చేసరికి భార్యను ఎవరో చంపుతున్నారు. ఇతను అతనితో పెనుగులాడాడు. కానీ పట్టుకోలేకపోయాడు. ఆ మాట చెప్తే పోలీసులు నమ్మలేదు. ఎందుకంటే బయటవాడు రావాలంటే తలుపులో, కిటికీలో పగలకొట్టాలి. అటువంటిది ఏదీ కనబడలేదు. పైగా ఎక్కడా వేలిముద్రలు లేవు.

ఇంకోటి ఏమిటంటే ఇతని భార్య తనపై హంతకుడు ఎటాక్ చేసినపుడు పోలీసులకు ఫోన్ చేసింది. అప్పుడు తన భర్త పేరు ఉచ్చరించడంతో భర్తే ఆమెను చంపాడని పోలీసులు నమ్మారు. పైగా ఇంటరాగేషన్‌లో పోలీసులు యింకో విషయాన్ని బయటకు తెచ్చారు. ఆమె పేర పెద్ద మొత్తానికి యిన్సూరెన్సు పాలసీ వుంది. ఆమె పోతే యితనికే వస్తుంది. దానికోసమే చంపాడని వాళ్లు నమ్మారు. అదే కోర్టులో చెప్పారు. కోర్టు నమ్మింది. మరణశిక్ష విధించింది. ప్రాణాంతకమైన యింజక్షన్ యిచ్చి ప్రాణం తీయమని జైలుకి పంపమంది.




ఇప్పుడు తెలుగులో ఫ్లాష్‌బ్యాక్‌లో వున్న కథకు వద్దాం. ఈ హత్య జరగడానికి ఏడాది క్రితం తెలుగు హీరో అమెరికా వెళ్లడానికి సన్నిద్ధమవుతున్నాడు. సెండాఫ్ పార్టీకి వెళుతూండగానే ఓ పిల్లవాడు ఆత్మహత్య చేసుకోబోవడం చూశాడు. అతని తల్లి వైద్యానికి డబ్బు లేక శంకర్

అనే పిల్లవాడు ఆ సాహసానికి ఒడి గట్టాడు. హీరో డబ్బిస్తానని ధైర్యం చెప్పి వైద్యానికి తీసుకెళ్లే లోపున ఆమె చనిపోయింది. హీరో తన అమెరికా ప్రయాణం మాను



కున్నాడు. 'అమ్మ హాస్పటల్' అనే పేర ఆసుపత్రి పెట్టి పేదలకు వుచితంగా వైద్యం చేస్తానన్నాడు. దానికోసం విరాళాలు పోగు చేయడం పనిగా పెట్టుకున్నాడు. దాంతో అతను పనిచేసే ఆసుపత్రి ఓనర్ కోటాకు గుండెల్లో రాయి పడింది. అతను డబ్బు సంపాదించడానికే ఆసుపత్రి పెట్టుకున్నాడు. శరత్‌బాబును స్వంత డబ్బు పెట్టి విదేశాలకు పంపి కిడ్నీ స్పెషలిస్టును చేశాడు. అతని ఫ్రెండు కదాని హీరోని ఉద్యోగంలోకి తీసుకుని అమెరికా పంపుదామనుకున్నాడు. చివరినిమిషంలో యితను యిలా ప్లాను మార్చడంతో ఒళ్లు మండింది.

అదే హాస్పటల్లో డాక్టరుగా పనిచేస్తున్న మనీషాకు హీరో ఆదర్శం నచ్చింది. ఆమె నిజానికి ధనికురాలే. కానీ ఆస్తంతా కోర్టుకేసుల్లో యిరుక్కుపోయింది. ముందూ వెనకా ఎవరూ లేక మధ్యతరగతి బతుకు బతుకుతూ హాస్టల్లో వుంటున్నా యితని ఆసుపత్రికి 10 వేలు విరాళం యిచ్చింది. అంతేకాదు, అతన్ని ప్రేమించింది. స్వప్న అనే మారు పేరుతో హీరోను వెంటాడి మెప్పించింది. కానీ ఓ సారి ఆ స్వప్నా, యీ డాక్టరూ ఒకరే అని హీరో గుర్తుపట్టాడు.

ఆమె తనను ప్రేమిస్తోంది కానీ బయటపడడానికి సంకోచిస్తోంది అని గ్రహించి హీరో ఓ నాటకం ఆడాడు. తన స్నేహితురాలు రమ్యకృష్ణను తన ప్రేయసిగా కాస్సేపు నటించమన్నాడు. అయితే అతనికి తెలియని విషయం ఏమిటంటే రమ్యకృష్ణ కూడా అతన్ని ప్రేమిస్తోంది. అంతేకాదు ఆమె మనీషాకు స్నేహితురాలు కూడా. ఎంత మంచి స్నేహితురాలంటే ఆమె ఆస్తి ఆమెకు రప్పించడానికి తను వకీలుని పెట్టి కేసు పోరాడుతోంది. ఆ వకీలు హీరో తండ్రే అనుకోండి. అతను రమ్యను చూసి కోడల్ని

చేసుకుందామని అనుకున్నాడు. ఎందుకంటే ఆమె పోలీసు ఆఫీసర్.

రమ్యకృష్ణ తనను ప్రేమిస్తోందని తెలియని హీరో కాన్సెప్టు నాటకం ఆడమన్నాడు. ఆమె మొదట్లో ఆశపడినా విషయం తెలిసి త్యాగం చేసింది. హీరో, మనీషాలకు పెళ్లయింది. వాళ్లు విడిగా వచ్చి కాపురం చేయసాగారు. ఆమె గర్భవతి అయింది. ఇంతలో మనీషా కేసు నెగ్గింది. బోల్డంత ఆస్తి వచ్చి పడింది. దాన్ని తన భర్త పేర ట్రాన్స్‌ఫర్ చేసేసింది. ఇతని ఆసుపత్రికి మంత్రిగారు 30 ఎకరాలు భూమి యిచ్చారు. ఆసుపత్రి పనులు చకచకా సాగుతున్నాయి. ఇలాటి సమయంలో వచ్చి పడింది ఆపత్తు. ఆ ఆసుపత్రిలో సంఘవ్యతిరేక శక్తులు పనిచేస్తున్నాయి. పేషంట్ల కిడ్నీలు దొంగిలించి అమ్మే వ్యాపారం సాగుతోంది. దుబాయినుండి కిడ్నీలకు ఆర్డర్లు వచ్చిపడుతున్నాయి. ఆసుపత్రి బేస్‌మెంట్ వాడుకో అని విలన్‌కు సందేశం అందింది.

ఆ తర్వాత ఓ పేషంటుకి కిడ్నీ మిస్సయిందని తెలియగానే మనీషా గొడవ చేసి కోటాను నిలదీసింది. హాస్పటల్ పేరు పోతుంది, తప్పెక్కడ జరిగిందో తెలుసుకుని సరిదిద్దుకుంటాను 24 గంటలు టైమియ్యమని కోటా బతిమాలాడు. రేపు పొద్దున్న కల్లా తప్పు దిద్దుకోకపోతే పోలీసులకు చెప్పి హాస్పటల్ మూయిస్తానని మనీషా హెచ్చరించింది.

కిడ్నీల వ్యాపారం చేసే గుల్షన్ గ్రోవర్‌కు ఫోన్ వచ్చింది. అవతలి వ్యక్తి తిట్టాడు - "వద్దన్నా ఆ కిడ్నీ తీశావ్. ఇప్పుడు మనీషా పోలీసుల వద్దకు వెళతానంటోంది. ఏం చేస్తావో ఏమో ఆమె నోరు మూతపడాలి." అని. ఆ రాత్రి హీరో ఓ కాన్ఫరెన్సులో వున్నాడు. ఈమె త్వరగా రమ్మనమని ఫోన్ చేసింది. అతను దారిలో వుండగానే మనీషాపై విలన్ దాడి చేశాడు. ఆమె వెంటనే పోలీసు కంట్రోలు రూంకు ఫోన్ చేస్తే డ్యూటీలో వున్న రమ్యకృష్ణ ఫోనెత్తి గుర్తు పట్టి ఏం జరిగిందని అడిగింది. నా పై దాడి జరుగుతోంది అని మనీషా అంది. ఎవరు చేస్తున్నారు అని రమ్య అడిగింది.

ఈమె సమాధానం చెప్పేటంతలో హీరో యింట్లోకి వచ్చి యిల్లంతా చిందరవందరగా వుండడం చూసి, భయపడి, భార్యను పేరు పెట్టి పిలిచాడు. ఆమె జవాబుగా అతన్ని "అజయ్" అని పిలిచింది. ఎవరు దాడి చేశారు? అన్న ప్రశ్నకు సమాధానంగా 'అజయ్' అని సమాధానమిచ్చింది అని పోలీసులు అపార్థం చేసుకున్నారు. అది వాళ్ల టేప్ రికార్డులో రికార్డయింది కూడా. హీరో మేడపైకి వచ్చేలోగా విలన్ మనీషాను పొడిచి పారిపోబోయాడు. హీరో అతన్ని అడ్డుకుని ఫైట్ చేశాడు. మనీషా చనిపోతూ మళ్లీ

ఒకసారి భర్త పేరు పిలిచి చనిపోయింది. హీరో ఆమె దగ్గరకు వచ్చేసరికి విలన్ పారిపోయాడు.



ఇంటరాగేషన్‌లో పోలీసు అధికారి నాజర్ ఆస్తి గురించి హీరోయే తన భార్యను చంపాడని అనుమానించాడు. తన అఫిడవిట్‌లో హీరో తనకూ, భార్యకూ శత్రువులు లేరని రాశాడు కానీ యీ మధ్యే ఆస్తి కలిసి వచ్చిందని రాయడం మర్చిపోయాడు. ఆమె చావు వలన లాభం కలిగేది నీకే కాబట్టి నువ్వే చంపావ్, మధ్యలో మూడో వ్యక్తి లేడు. నువ్వు కల్పిస్తున్నావు అని నాజర్ ఆరోపించాడు. దురదృష్టవశాత్తూ అతని వేలిముద్రలు హత్యాస్థలంలో దొరకలేదు. నాజర్ తండ్రి మరో స్త్రీ మోజులో భార్యను చంపాడు. అది కళ్లారా చూసిన నాజర్‌కు అటువంటివాళ్లపై కక్ష. హీరోకూడా అలాటివాడే అని గాఢంగా నమ్మి రమ్యకృష్ణ మాటలు కొట్టి పారేశాడు.

కోర్టులో కేసు జరిగింది. హీరో తరఫున తండ్రి వాదించినా లాభం లేకపోయింది. ఆసుపత్రి పెట్టడానికి కావలసిన నిధులకోసం భార్యను చంపాడని పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాదించాడు. రమ్యకృష్ణ హీరో తన భార్యను ఎంత గాఢంగా ప్రేమించాడో తనకు తెలుసునని, భార్యను చంపే రాక్షసుడు కాదనీ రమ్యకృష్ణ కోర్టులో ఎమోషనల్‌గా చెప్పింది. రమ్యకృష్ణది మనవాళ్లు కల్పించిన పాత్ర. ఆమె గతంలో అతన్ని ప్రేమించి విఫలమవడం, తర్వాత హీరోని రక్షించాలని ప్రయత్నించి విఫలమవడం మనవాళ్లు పెట్టిన డ్రామా. ఒరిజినల్‌లో హీరో భార్య పేర యిన్సూరెన్సు వుంటే తెలుగులో ఆస్తి వుంది. హీరోకు ఉరిశిక్ష పడింది. రాజమండ్రి జైలుకి తీసుకెళ్లాలని వ్యాన్ ఎక్కించారు.

ఇక్కణ్నుంచి యింగ్లీషు సినిమా, తెలుగు సినిమా ఒకేలాగ నడుస్తాయి. వ్యాన్‌లో తీసుకెళుతుండగా వ్యాన్‌లో ఓ ఖైదీ నాటకం ఆడి ఓ యిన్‌స్పెక్టర్‌ను గాయపరచాడు. జరిగిన కొట్లాటల్లో బస్సు కంట్రోలు తప్పింది. గాయపడిన యిన్‌స్పెక్టర్‌ను వైద్యం చేసి కాపాడమంటూ మరో యిన్‌స్పెక్టర్ హీరో సంకెళ్లు విప్పేశాడు. ఇంతలో రైలు వచ్చి

గుద్దేయబోయింది. హీరో ఆ గాయపడిన అతన్ని కాపాడాడు. అతను కృతజ్ఞతతో యితన్ని కాళ్ల సంకెళ్లు కూడా యిప్పేశాడు. పొట్టలో గాయంతో హీరో పారిపోసాగాడు. ఇంతలో ప్రమాదస్థలికి చేరిన పోలీసు అధికారికి విప్పేసిన సంకెళ్లు కనబడ్డాయి. హీరో తప్పించుకున్నాడని గ్రహించి ఎక్కడ కనబడ్డా పట్టుకోమని ఆర్డర్లు వేశాడు. అతని ఫోటో అన్ని చోట్లా సర్క్యులేట్ చేశాడు.



ఈ లోగా హీరో ఓ హాస్పటల్ చేరాడు. ఓ గదిలోకి దూరి తన పొట్ట తానే కుట్టుకుని తన వైద్యం తనే చేసుకున్నాడు. ఓ పేషంటు గదిలోకి దూరి గడ్డం తీసేసి, అతని బ్రేక్‌ఫాస్ట్ తినేసి యాంబులెన్సు ఎక్కి పారిపోయాడు. సరిగ్గా అదే ఆసుపత్రికి గాయపడిన ఎస్సయిని తీసుకురావడంతో, అతను యితన్ని గుర్తుపట్టేశాడు. ఆ సమాచారం పోలీసు అధికారికి చేరడంతో అతను యాంబులెన్సులు వెతకడానికి హెలికాప్టర్‌లో బయలుదేరారు. చివరకు హీరో ఓ టన్నెల్‌లో దూరాడు. అక్కణ్నుంచి ఓ డ్యామ్‌కు వెళ్లేందుకు సొరంగ మార్గం వుంది. పోలీసు అధికారి అది కనిపెట్టి అతనూ దిగాడు. అక్కడ హీరో, పోలీసు అధికారి తలపడ్డారు. హీరో ఓ పోలీసును చంపగలిగి కూడా చంపలేదు. చివరకు పట్టుబడవలసిన సమయంలో ప్రాణాలకు తెగించి డ్యామ్‌లోకి దూకేశాడు.

తెలుగులో దీన్ని యాజ్ ఇటీజ్‌గా దింపేశారు. మధ్యలో శివాలయంలో దేవుణ్ని నిందించే సీను కలిపారు. అయితే రమ్యకృష్ణ పాత్ర అదనంగా పెట్టారు. హీరోను కాల్చే అవకాశం వచ్చినా ఆమె కాల్చదు, అతని సంగతి తెలుసు కాబట్టి. డ్యామ్‌లోకి దూకి యీత కొట్టి తప్పించుకున్నాక హీరో రమ్యకృష్ణ యింటికి వచ్చాడు. ఆమెతో మాట్లాడడంలో తన భార్య హంతకుడికి కుడిచేతికి బదులు పెట్టుడు చెయ్యి వుందని చెప్పాడు. అతడి

గురించి వెతికి, వేటాడి అప్పుడు లొంగిపోతానన్నాడు. ఆమె యింట్లో తన ఫోటో చూసి 'నాపై నీ ప్రేమ తెలుసుకున్నాను. థ్యాంక్స్ తప్ప మరేమీ చెప్పలేన'ని చెప్పి ఉత్తరం రాసి వెళ్లిపోయాడు. ఇంగ్లీషు ఒరిజినల్‌లో రమ్యకృష్ణ పాత్ర లేదు కాబట్టి పారిపోతూ వుంటే హీరోకే హంతకుడి పెట్టుడు చెయ్యి గుర్తుకు వచ్చినట్టు చూపించారు.



ఇక హీరో విలన్ గురించి వేట ఆరంభించాడు. జుట్టుకి రంగు మార్చాడు. షికాగోకి తిరిగి వచ్చాడు. ఆసుపత్రిలో తన కొలీగ్, స్నేహితుడు డాక్టర్ నికొలస్‌ని రహస్యంగా కలిసి డబ్బు అడిగాడు. ఊరి చివర ఓ ఇంట్లో కింది వాటా అద్దెకు తీసుకున్నాడు. గవర్నమెంటు ఆసుపత్రికి వెళ్లి ప్లాస్టిక్ కాళ్లు చేతులు బిగించే విభాగం చూసి వచ్చాడు. అక్కడి సెక్యూరిటీవాడి ఐడీ దొంగిలించాడు. తన ఫోటోతో దొంగ ఐడీ కార్డు తయారుచేసుకున్నాడు. అది పెట్టుకుని హాస్పటల్ రికార్డు రూములోకి జొరబడి కిటికీలు క్లీన్ చేస్తున్నట్టు నటిస్తూ కంప్యూటర్ వద్దకు చేరాడు. తన భార్య పోయిన తర్వాత తమ పెట్టుడు చేతులు రిపేరు చేయించుకున్నవారి రికార్డులు కంప్యూటర్లో చూశాడు. అయిదుగురి పేర్లు తేలాయి.

తెలుగులో ఈ ఐడీ బాదరబందీ ఏమీ పెట్టలేదు. రికార్డు అసిస్టెంటుకి హీరో లంచం యిచ్చేసి వివరాలు సంపాదించేశాడు. అంతకుముందే తన స్నేహితుడు, సాటి డాక్టర్ అయిన శరత్‌బాబుని కలిసి నా ఆస్తంతా నీ పేర వీలునామా రాస్తున్నాను. అమ్మ ఆసుపత్రి కట్టించు అని చెప్పాడు. హీరోకి ఆశ్రయం యిచ్చినందుకు పోలీసు అధికారి నాజర్ రమ్యకృష్ణను నిందించాడు. ఆమె రిజైన్ చేసేసింది. పెట్టుడు చెయ్యి వాడే హంతకుడని హీరో నమ్మకమని చెప్పింది. అయితే అతను ఆసుపత్రికే వెళ్లి వుంటాడనుకుని నాజర్ ఆసుపత్రిని చుట్టుముట్టాడు. తనకు కావలసిన డాక్యుమెంట్లు చేజిక్కించుకుని వెళ్లిపోతున్న హీరోకి ఓ పేషంటు కళ్లబడతాడు. అతను శంకరే. ఆపరేషన్

థియేటర్‌కి వెళ్లాక అతనికి కిడ్నీ లేదన్న సంగతి గ్రహించి ఆ విషయం స్టాఫ్‌కి చెప్పి అతన్ని కాపాడి మరీ వెళతాడు హీరో.

ఒరిజినల్‌లో కూడా హీరో వుంటున్న యింటి ఓనర్ను ఇంటరాగేట్ చేసి పోలీసులు హీరో యింటికి వెళతారు. అక్కడ అతని గదిలో డూప్లికేట్ ఐడీ పేపర్లు చూసి అనుమానించి యీ ఆసుపత్రికి వస్తారు. అతను పారిపోతూ పోతూ ఓ పేషంటు డయాగ్నసిస్ మార్చి మరీ వెళతాడు. ఇదంతా గమనించిన ఓ డాక్టర్ "అతను ఓ పేషంటు ప్రాణాలు కాపాడాడు" అంది. పోలీసు అధికారికి హీరో మంచివాడేమోనన్న సందేహం కలిగింది. ఆ ప్లాస్టిక్ చేయివాడు ఉన్నాడేమో చూదాం అనుకుని అతనూ కంప్యూటర్‌లో వెతికాడు. హీరోకి దొరికిన పేర్లే దొరికాయి. అతనూ వాళ్లని యిన్వెస్టిగేట్ చేద్దామనుకున్నాడు.

తనకు దొరికిన అయిదుగురు పేర్లవాళ్లనూ ఒకరొకరికీ ఫోన్ చేసి కనుక్కోవడం మొదలెట్టాడు హీరో. ఒకతను జైల్లో వున్నాడని తెలిసి చూడడానికి వెళ్లాడు. అతన్ని చూడగానే అతను కాదని తెలిసిపోయింది. లేచి వచ్చేశాడు. కానీ అదే టైముకి అదే పనిమీద వచ్చిన పోలీసు అధికారి కంటపడ్డాడు. అతను మెట్లమీద గుర్తుపట్టి యితన్ని పిలిచాడు. అతి కష్టం మీద తప్పించుకుని బయటపడ్డాడు. అలా ఒక్కొక్కరిని వెతుకుతూ వచ్చి ఫైనల్‌గా ఆఖరివాడి యింటికి వెళ్లాడు. అక్కడ అతని ఫోటో చూసి యితనే అసలైన హంతకుడని అని గుర్తుపట్టాడు. అతను ఒక రిటైర్డ్ పోలీసుమన్. వాడి ఫైల్సులో ఓ మందుల కంపెనీ పే స్లిప్స్ వున్నాయి. కొందరు డాక్టర్లతో ఫోటోలున్నాయి.

తెలుగు సినిమాలో కిడ్నీ దొంగలించడం అని అందరికీ అర్థమయ్యేట్లా పెట్టారు కానీ ఒరిజినల్‌లో కాస్త కాంప్లికేటెడ్‌గా వుంటుంది. మందుల కంపెనీలకు, డాక్టర్లకు వుండే లావాదేవీల గురించిన కథ యిది. తాము తయారు చేసే మందులలో లోపాలు బయటపెట్టకుండా వుండడానికి డాక్టర్లకు లంచాలు పెడుతూ వుంటాయి మందుల కంపెనీలు. కార్లు, విదేశీయాత్రలు యిలా అనేక రకాలుగా వుంటాయి ఆ లంచాలు. వేటికీ లొంగనివాడు మన హీరో.

అన్నిటికీ లొంగేవాడు మన హీరో ఫ్రెండ్ డా॥ నికొలస్. ఓ కంపెనీ తయారుచేసే ప్రొజాయిక్ అనే గుండె జబ్బు మందుని అతను ప్రమోట్ చేస్తున్నాడు. దానివలన సైడ్ ఎఫెక్ట్స్ కలిగి లివర్ పాడై పోతోందని చెప్పి యీ డాక్టర్ దాన్ని వాడవద్దన్నాడు. కొంతమంది మీద ప్రయోగించి మందుప్రభావాన్ని అంచనా వేస్తారు ఆ క్లినికల్ రిజల్ట్‌సను డా॥ నికొలస్ తనకనువుగా మార్చేశాడు. కాంప్లికేషన్సు వస్తున్నాయని రాసిన




పెథాలజిస్టును చంపించేశాడు. అడ్డుపడుతున్న హీరోని హత్యకేసులో యిరికించేద్దామని ప్లాను వేశాడు. తన వద్దనున్న హీరో యింటి తాళంచెవిని హంతకుడికి యిచ్చాడు. అందుకే తలుపులు, కిటికీలు బద్దలు కొట్టనక్కరలేక పోయింది. ఇవన్నీ హీరో ఒకటొకటిగా కనుగొన్నాడు. ఆ ప్రొజాయిక్ మందు శాంపుల్స్ సంపాదించి పెథాలజిస్టు చేత టెస్టుచేయించి నిర్ధారించుకున్నాడు. డాక్టర్ నికొలస్‌యే అసలు విలన్ అని మనకు తెలిసేది యిక్కడే.

తెలుగులో శరత్‌బాబు మెయిన్ విలన్ అని చివర్లో గానీ తెలియదు. తెలుగులో కూడా హీరో హంతకుడి యింటికి రాగానే విషయాన్ని గ్రహించి, అక్కణ్నుంచి పోలీసులకు ఫోన్ చేసి వాళ్లు అక్కడకు వచ్చి తమంతట తామే వచ్చి జరిగినది గ్రహించేట్టు చేస్తాడు. ఇక్కడ తెలుగులో చేసిన మార్పు ఏమిటంటే హీరో కోటా కు ఫోన్ చేసి నా భార్యను ఎందుకు చంపావని అడిగాడు కోటకు సందేహం వచ్చి బేస్‌మెంట్‌కి వెళ్లాడు. తన బేస్‌మెంట్‌లో జరుగుతున్న మారణకాండ చూశాడు. ఇదేమిటని హంతకుణ్ని అడగబోతే అతనే యితన్ని తలపై కొట్టి చంపేశాడు. గుడ్ అని అభినందించాడు వెనకనుండి కథ నడిపిస్తున్న వ్యక్తి. అతనెవరో మనకు తెలియదు కానీ కోటా మాత్రం మెయిన్ విలన్ కాదని మనకు తెలుస్తుంది.

ఇక యింగ్లీషు సినిమాలో విలన్ నికొలస్ ఓ హంతకుణ్ని నియోగించి హీరోని వెంటాడమన్నాడు. లోకల్ ట్రెయిన్‌లో అతను హీరోని మట్టుపెట్టే సమయానికి పోలీసు ఎదురయ్యాడు. హంతకుడు పోలీసును కాల్చాడు. హీరో తప్పించుకుని పారిపోయాడు. పోలీసులు హెలికాప్టర్‌లో హీరోని వెంటాడారు. కానీ హీరో గమ్యం – డాక్టర్ నికొలస్ పాల్గొంటున్న సదస్సు. ప్రొవాజిక్ మందుకి సైడ్ ఎఫెక్ట్స్ లేవని నికొలస్ అంటూండగానే




హీరో వచ్చి చేరాడు. అతను అబద్ధాలు చెపుతున్నాడని అందరి ఎదురుగా డిక్లేర్ చేశాడు. అతన్ని పక్కగదిలోకి రమ్మనమని చెప్పి నికొలస్ అతన్ని చంపబోయాడు. భీకరయుద్ధం జరిగింది. పోలీసులు సమయానికి చేరారు. నికొలస్ పోలీసాధికారి ప్రాణాలు తీయబోతూ వుంటే హీరో కాపాడాడు. నువ్వు నిరపరాధివని నాకు తెలుసు అంటాడు పోలీసాధికారి. కథ సుఖాంతం.

తెలుగులో లోకల్ ట్రెయిన్ సంఘటన తీసేసి క్లబ్ డాన్సు పెట్టారు. విలన్ గుల్షన్ గ్రోవర్ హీరోని చూసి ఫైట్ చేస్తాడు. డెన్‌లో కోటా శవం చూసి హీరో కంగు తింటాడు. అక్కడ కళ్లజోడు చూసి అసలు సూత్రధారి కోటా కాదని, శరత్‌బాబని గుర్తుపడతాడు. ఇంగ్లీషులో లాగానే క్లయిమాక్స్ నడుస్తుంది. హీరో కాన్ఫరెన్సుకి వెళ్లడం, విలన్ శరత్‌బాబును నిలదీయడం, అతను పక్కరూముకి తీసుకెళ్లి ఫైట్ చేయడం, ఇంతలో పోలీసులు రావడం, విలన్ రమ్యకృష్ణ నుండి పిస్తోలు లాక్కుని నాజర్‌ను చంపబోవడం, చివరకు పట్టుబడడం జరుగుతాయి. అమ్మ హాస్పటల్ ఆరంభమౌతుంది. హీరో రమ్యకృష్ణను పెళ్లి చేసుకుని వుంటాడని సూచిస్తూ కథ ముగుస్తుంది.

ఇంగ్లీషు సినిమాలో వున్న బిగిని తెలుగులోకి పట్టుకుని వస్తూనే ప్రేమ, త్యాగం, తలితండ్రుల దుఃఖం వంటి సెంటిమెంట్స్ బాగా దట్టించారు. శంకర్ అనే కారెక్టరు క్రియేట్ చేసి అతని ద్వారా కథ నడిపించారు. హీరో ఆదర్శం సఫలమైనట్టుగా చూపించారు. కీరవాణి సంగీతం కూడా సినిమాకు హైలైట్. తెలుగు సినిమా కథ సాయినాథ్ అని చూపించారు. కథకు నేటివ్ టచ్ బాగా అమరింది. ఇదీ క్రిమినల్ సినిమా అసలు కథ.



# డాక్టర్ చక్రవర్తి

సినిమారంగం మంచి కథలకోసం నిరంతరం వెతుకుతూనే వుంటుంది. పుస్తకరూపంలో వచ్చిన కథలను సినిమాలుగా మలుచుకుంటూంటుంది. ఒకప్పుడు విదేశీ నవలలను, బెంగాలీ నవలలను తెలుగు సినిమాలుగా మార్చుకోవడం ఎక్కువగా వుండేది. క్రమేపీ తెలుగు నవలలను సినిమాలుగా మార్చుకోవడం కొంతకాలం పాటు విరివిగా జరిగింది. ఆ ప్రక్రియకు శ్రీకారం చుట్టిన సినిమా "డాక్టర్ చక్రవర్తి". 1964 నాటి ఈ సినిమాకు ఆధారం అప్పటికే ఆంధ్రప్రభ వీక్లీలో సీరియల్‌గా వచ్చిన "చక్రభ్రమణం" అనే కోడూరి కౌసల్యాదేవిగారి నవల.

అన్యోన్యంగా వున్న దంపతుల మధ్య అపార్థాలు వచ్చి వారిద్దరు వేరుపడడం, చివర్లో కలవడం కథాంశం. ఆ అపార్థానికి కారణం - డా॥ చక్రవర్తి అనే ఓ ఫ్యామిలీ ఫ్రెండ్. దంపతులు జగ్గయ్య, సావిత్రి కాగా, చక్రవర్తి పాత్రను నాగేశ్వరరావు, అతని భార్య పాత్రను జానకి పోషించారు. నిజానికి నాగేశ్వరరావు సావిత్రిని చెల్లెలు లాగానే చూస్తాడు. కానీ నాగేశ్వరరావు భార్యకు జానకికి, సావిత్రి భర్త జగ్గయ్యకు అనుమానం వస్తుంది.




దానికి కారణం నాగేశ్వరరావు మిస్టీరియస్ బిహేవియర్. అతను సావిత్రిని చెల్లెలిగా భావిస్తున్నానని చివరిదాకా చెప్పడు. దాంతో అతని వుద్దేశం ఏమిటో పాఠకుడికి చివరిదాకా సస్పెన్సే. కానీ సినిమాగా తీసినపుడు ఆ సస్పెన్సు తీసేశారు. వాళ్లు మొదటిసారి పరిచయమయినప్పుడే సావిత్రిలో తన

చెల్లెల్ని చూసుకున్నాడని సినిమా ప్రేక్షకుడికి చెప్పేసి అతనికి హీరోపై సానుభూతి కలిగేట్లా చూశారు. ఇది అత్యంత కీలకమైన మార్పు. ఇదే కాదు, అనేక అర్థవంతమైన మార్పులు చేసి సినిమాను నవల కంటె మిన్నగా తీర్చిదిద్దారు. వాటి గురించి ఈ రోజు చెప్పుకుందాం. మొదట సినిమాలో చూపించిన ఆర్డర్లో కథ చెప్పుకుందాం.

ఆమె డాక్టర్ శ్రీదేవి (పాత్రధారిణి కృష్ణకుమారి) అనే ఆమె ఫారిన్ చదువుకి వెళ్లిన క్లాస్‌మేట్ చక్రవర్తి గురించి ఎయిర్‌పోర్టులో ఎదురుచూడడంతో సినిమా ప్రారంభమౌతుంది. వాళ్లిద్దరూ ప్రేమించుకున్నారు. హీరో చక్రవర్తి (పాత్రధారి నాగేశ్వరరావు)కి చెల్లెలంటే ప్రాణం. తల్లీతండ్రీ చిన్నప్పుడే పోయారు. చెల్లెల్ని పెళ్లి చేసుకున్నతను పెట్టుబడి పెట్టి యితన్ని ఫారిన్ పంపించాడు. నాగేశ్వరరావు, కృష్ణకుమారి యిద్దరూ పెళ్లి చేసుకుని ఆసుపత్రి ఒకటి కట్టి పేదలకు సేవ చేయాలని ప్లాను. చెల్లెలు పుట్టినరోజు కదాని వాళ్లింటికి వెళ్లాడు. కృష్ణకుమారి వాళ్ల వూరికి వెళ్లింది.

హీరో చెల్లెలు గీతాంజలి. ఆమె ఆడపడుచు జానకికి హీరో అంటే యిష్టం. ఆ విషయం గీతాంజలికి తెలుసు. అన్నకూ ఆమెకూ పెళ్లి జరిగితే బాగుండునని ఆమె ఆశ. గీతాంజలి సంగీతం, సాహిత్యం రెండింట్లోనూ దిట్ట. అన్నగారు ఫారిన్ వెళ్లినపుడు పుస్తకాలు రాసింది. అన్నకోరికపై పాట పాడింది. "పాడమని నన్నడగవలెనా, పరవశించి పాడనా" అనే పాట యిక్కడే వస్తుంది. నిజానికి ఆమెకు లంగ్ కాన్సర్. ఆ విషయం తెలిస్తే అన్నగారు ఫారిన్‌నుండి తిరిగి వచ్చేస్తాడేమోనన్న భయంతో తెలియపరచలేదు. కానీ అతను వచ్చినరోజునే అది బయటపడింది. పాట చివరిలో 'నే పాడజాలక పోయినా..' చరణం పాడుతూ వుంటే రక్తం కక్కుకుంది. కాన్సర్ చివరిదశలో వుంది. ఆమె ఆసుపత్రి పాలయింది.



ఆ క్షణంలో తమకెంతో ఉపకారం చేసిన కుటుంబంతో సంబంధం

తెగిపోకూడదని కోరుకుంది. అన్నగారు కృష్ణకుమారిని ప్రేమిస్తున్నాడని తెలుసుకునే అవకాశం ఆమెకు చిక్కలేదు. కృష్ణకుమారిని హీరో డా॥శ్రీదేవి అని పరిచయం చేయడంతో ఆమె డాక్టర్ మాత్రమే అనుకుంది పాపం. 'మా ఆడపడుచును చేసుకో' అని అన్నను కోరింది. మరణశయ్యపై వున్న చెల్లెలి కోరిక మన్నించాలంటే, తన ప్రేమను వదులుకోవాలి. హీరో సంకటంలో వడ్డాడు. అతను తటపటాయిస్తూ వుంటే కృష్ణకుమారి త్యాగం చేసింది. చెల్లెలికోసం త్యాగం చేయమని అతన్ని ప్రోత్సహించింది. అతను సరేనన్నాడు. నాగేశ్వరరావు, జానకి చేతులు కలిపి గీతాంజలి చనిపోయింది. హీరో చెల్లెలి పేర హాస్పటల్ కట్టి తన స్నేహితురాను కృష్ణకుమారిచేత ఓపెనింగ్ చేయించాడు. బావగారు దేశం తిరిగి వస్తానని వెళ్లిపోయాడు.




ఇక్కడ వరకు సినిమాలో అరగంట ఆట అయింది. ఇప్పుడు సావిత్రి పాత్ర ప్రవేశం. నవలలో అయితే ఆమెతోనే ప్రారంభం. అక్కడ ఆమె చుట్టూనే కథ నడుస్తుంది. సినిమా డాక్టర్ చుట్టూ తిరుగుతుంది. ఇక్కడవరకు చూపించిన విషయాలను నవల చివర్లో చెప్తారు. నవలలో – హీరో తండ్రి పెద్ద విలన్. తన యిష్టాయిష్టాలను కొడుకు మీద రుద్దుతాడు. ఈ హీరో తండ్రి మాటకు ఎదురు చెప్పలేక జీవితాన్ని నాశనం చేసుకుంటాడు. తను యింకో అమ్మాయిని ప్రేమించానన్న విషయం కూడా తండ్రికి చెప్పకుండా, అతను సూచించిన అమ్మాయినే పెళ్లి చేసుకుంటాడు. ఆ విధంగా అతనిలో హీరోయిజం కనబడదు. అతని భార్య చెల్లెలి ఆడపడుచు కాదు. ఇతన్ని యిష్టపడి పెళ్లి చేసుకోదు. డబ్బున్న గర్విష్టి. పెళ్లయాక యితను ఫారిన్ ట్రిప్ వెళుతున్నానంటే ఏమీ ఫీలవదు. అతను వెళ్లాక అతని సవతి తల్లి యీమెకు నూరిపోస్తుంది – యితను కాలేజీలో ఎవరో అమ్మాయిని ప్రేమించాడనీ, అందుకే భార్యను పట్టించుకోకుండా ఫారిన్ వెళ్లాడని. అది నమ్మి ఆమె యితనంటే విముఖత పెంచుకుంటుంది.

హీరో ఫారిన్ నుండి వచ్చాక సవతి చెల్లెలికి సంబంధం చూస్తాడు. తండ్రి మరో సంబంధం కుదురుస్తాడు. అతనో శాడిస్టు. డబ్బున్నవాడు కాదు. అతని చేతిలో అష్టకష్టాలు పడి చెల్లెలు చచ్చిపోతుంది. ఇతను ఆమె ఫోటో తన బెడ్‌రూమ్‌లో పెట్టుకుంటాడు. ఆమె ఎవరో నవలలో కడదాకా మనకు తెలియదు. చచ్చిపోయిందని సూచించేట్టు ఫోటోకు దండ వేయకపోవడం వలన ఆమె హీరో ప్రియురాలు అయి వుంటుందని సావిత్రి అపోహ పడుతుంది. కృష్ణకుమారిని ప్రేమించి జానకిని పెళ్లి చేసుకున్నాడన్న సంగతి కూడా నవల చివరిదాకా తెలియదు. సినిమాలో అయితే హీరో త్యాగానికి, చెల్లెలిపై ప్రేమకు లింకు పెట్టి డెప్త్ తెచ్చారు. హీరో భార్య కారెక్టర్‌ను మరీ వ్యాంప్‌గా కాకుండా సహజత్వానికి దగ్గరగా తీర్చిదిద్దారు. ఆమె కృష్ణకుమారిపై ద్వేషం పెంచుకోదు. నవలలో ఆమెకు మొదటినుండీ షికార్లు అలవాటు అన్నట్టు రాయగా, సినిమాలో భర్తే ఆమెను ప్రోత్సహించినట్టు చూపారు.

పిక్నిక్‌లు అవీ తనకి పడవని చెప్పి హీరో భార్యను స్నేహితురాళ్లతో కలిసి పిక్నిక్‌కు వెళ్లమంటూంటాడు. ఆ విధంగా ఆమెకి అవి అలవాటవుతాయి. హీరో తన వృత్తితో, ఆమె తన స్నేహితురాళ్లతో కాలం గడుపుతూంటారు. వీళ్లకి కాంట్రాస్టుగా హీరో ఫ్రెండు జగ్గయ్య కాపురాన్ని చూపిస్తారు. జగ్గయ్య ఇంజనియర్. అతని భార్య సావిత్రి సాహిత్యం, సంగీతంలో దిట్ట. కథలు రాస్తూ వుంటుంది. వాళ్ల కాపురం ఎంత అన్యోన్యంగా వుందో చూపించడానికి యివతల హీరో భార్య స్నేహితురాళ్లతో కలిసి పాడుకునే 'నిజం చెప్పవే పిల్లా, ఎలా వుంది యీ వేళ' పాట చూపిస్తూ అవతల జగ్గయ్య, సావిత్రిల మధ్య 'రాగం నీవే..' పాట చూపించారు.

ఓ సారి జగ్గయ్య హీరో దంపతులను యింటికి భోజనానికి పిలిచాడు. కొన్ని పోలికల వలన హీరోకి సావిత్రిని చూడగానే తన చెల్లెలు గీతాంజలి గుర్తుకు వచ్చింది. వాళ్లింట్లో వీణ చూసి పాట పాడమని అడిగితే సావిత్రి పాట పాడింది. గీతాంజలి పాడిన పాట ట్యూనే. పల్లవిలో తేడా గమనించండి. గీతాంజలి – పాడమని నన్నడగ వలెనా, పరవశించి పాడనా అని పాడుతుంది. అడిగినది అన్నగారు కాబట్టి. కానీ సావిత్రి – పాడమని నన్నడగ తగునా అని పాడుతుంది. అడిగినది పరాయివాడు కాబట్టి. ఇవి సినిమాటిక్ టచెస్. ఆ పాట విని హీరో కన్నీరు పెట్టుకున్నాడు. సావిత్రిలో తన చెల్లెలు గీతాంజలిని చూసుకున్నాడు. సావిత్రి గర్భవతి అయింది. ప్రసవానికి తీసుకెళ్లడానికి ఆమె అన్నయ్య గుమ్మడి వచ్చాడు. అయితే జగ్గయ్య పంపలేదు. గుమ్మడి హీరోకి

ఫ్రెండు.

జగ్గయ్యకు భార్యంటే ఎంతో ప్రేమ. అయితే ఆమె సోషల్‌గా వుండదని అతని ఫిర్యాదు. ముఖ్యంగా హీరో యింటికి, తోటకు వెళదామని అతను ప్రోద్బలం చేస్తుంటాడు. సావిత్రికి అది యిష్టం లేదు. హీరో తీసుకుంటున్న అతి చనువు ఆమెకు నచ్చదు. నవల సగానికి పైగా యీ విషయంపైననే నడుస్తుంది. పాఠకుడికి కూడా చికాకుగానే అనిపిస్తుంది. పాఠకుడికే చికాకుగా వుంటే హీరో భార్యకు వుండదూ? సినిమాలో యిక్కడో ఘట్టం పెట్టారు. హీరో భార్య జానకి పుట్టినరోజు పండగ. జగ్గయ్య వూళ్లో లేడు. సావిత్రిని రమ్మనమంటే రాదు. ఆవిడ రాకపోతే ఎంత? అనుకుంటుంది జానకి.

అంతలో సావిత్రి మావగారికి (వాళ్ల యింటికి వచ్చాడు) జబ్బు చేసింది. హీరో డాక్టర్ కదా, ఫోన్ చేస్తే జానకి భర్త వున్నా లేడని చెప్పేస్తుంది - పేషంటని చెప్తే భర్త అక్కడకి పరిగెడతాడని. అయితే సావిత్రే పార్టీకి వచ్చి మావగారి విషయం చెపుతుంది. ఆమెను చూసి పార్టీ మధ్యలో వదిలేసి వైద్యం చేయడానికి హీరో వెళ్లిపోయాడు. ఆవిడ వెంటపడి నిన్ను నిర్లక్ష్యం చేస్తున్నాడని ఆమె స్నేహితులు రెచ్చగొట్టారు. దాంతో ఆమె హీరో తిరిగి రాగానే పోట్లాట వేసుకుంది - పుట్టినరోజు పూట కూడా నా భర్త నా దగ్గర లేకపోతే ఎలా? అయినా ఊళ్లో మరే డాక్టరూ లేడా? మీ దగ్గరకే రావాలా? అని.

సినిమాలో సూర్యకాంతానికి ఓ పాత్ర కల్పించారు. ఆమె జానకికి పుట్టింటినుండి వచ్చిన వంటలక్క. జానకికి దుర్బోధలు చేస్తూ వుంటుంది. దరిమిలా ఆమె చేత ఆకాశరామన్న ఉత్తరం రాయించింది కూడా ఆమెనే అన్నట్టు చూపించారు. నవలలో జానకే రాస్తుంది. ఈ విధంగా జానకి పాత్రను మరీ అంత వ్యాంపిష్‌గా చూపించకుండా జాగ్రత్తపడ్డారు. భార్య ప్రవర్తనతో బాధపడిన హీరో తోటలో ఒంటరిగా కూర్చుని పాడుకునే పాట చాలా హిట్ సాంగ్ - మనసున మనసై !



అలా పాడుకుంటూ వుంటే జగ్గయ్య తన భార్యతో సహా వచ్చాడు. భర్త బలవంతంపై వచ్చింది తప్ప సావిత్రికి ఏ మాత్రం యింట్రస్టు లేదు. అక్కడకు వచ్చాక హీరో పాడుతూంటే సితార్

వాయించమని భర్త కోరితే అతన్ని నొప్పించడానికి యిష్టం లేక సావిత్రి సితార్ వాయించింది కానీ హీరో అతి చనువు నాకు నచ్చలేదని భర్తకు గట్టిగా చెప్పింది. మాధవి రాసిన నవలను హీరో మెచ్చుకుని ఆమెకే ఫస్ట్ ప్రైజ్ వస్తుందని అంటాడు.

సినిమాలో ఈ దశలో హీరో తనను ఏ రకంగా చూస్తున్నాడో సావిత్రికి తెలిసి ఆమె మనసు ఊరడిల్లుతుంది. హీరో ఆసుపత్రిలో పేషంటుగా వున్న మావగార్ని చూడడానికి వచ్చి, హీరో గదిలో వున్న గీతాంజలి ఫోటోను చూస్తుంది. హీరో ఆ ఫోటోలో వ్యక్తి గురించి గొప్పగా చెప్పి, ఆమె స్థానంలో మిమ్మల్ని చూస్తున్నాను అనడంతో ఆమెకు అపోహ కలిగి హీరోని మిత్రద్రోహి అంటుంది. అప్పుడు హీరో ఆమె నా చెల్లెలు అంటాడు. ఈమెకు అపోహ తొలగిపోతుంది. కానీ వాళ్లు ఒకరినొకరు అన్నా అని గాని, చెల్లీ అనిగానీ పిలుచుకోరు. ఆమె చక్రవర్తిగారూ అంటుంది, యితను మాధవీ అని ఏకవచనంలో పిలుస్తాడు. ఇదే అన్ని రకాల అపార్థాలకు కారణం. ఇక్కడకు సినిమా సగం పూర్తవుతుంది. నవలలో యిది చివరి అధ్యాయంలో వస్తుంది. అప్పటిదాకా సావిత్రికి యితన్ని భరించలేక పోతూ వుంటుంది.

ఇంతలో జగ్గయ్యకు వారం రోజుల క్యాంప్‌కు వెళ్లవలసి వస్తుంది. భార్య తనతో వస్తానంటే వద్దని చెప్పి ఆమెను హీరోకి అప్పజెప్పి వెళ్లాడు. ఇక హీరో అతి సిన్సియర్‌గా సావిత్రి యింటికి పొద్దున్నా, సాయంత్రం వెళ్లడం, అక్కడే భోజనం చేయడం, యివన్నీ జోరుగా సాగించాడు. కానీ అతని భార్య యివన్నీ అపార్థం చేసుకుంది. పనివాళ్ల ద్వారా ఆరాలు తీసి, మరింత వూహించుకుంది.

ఆమెకు తోడు మంధర లాటి సూర్యకాంతం. ఓ రోజు సావిత్రి భర్తను తలచుకుని "నీవు లేక వీణ" అని పాడుతూ వుంటే ఆ పాట నచ్చి ఓ కాగితంమీద రాయించుకుని వచ్చాడు హీరో. ఆ పాట జానకి కంట పడింది. ఆమె అనుమానం పెరిగింది. సూర్యకాంతం సలహా విని జగ్గయ్య పేర ఆకాశరామన్న వుత్తరం రాసి సాక్ష్యంగా దీన్ని జతపరచింది. ఉత్తరం చూడగానే జగ్గయ్యకు అనుమానం కలిగింది. టూర్ కాన్సిల్ చేసుకుని హఠాత్తుగా అర్ధరాత్రి యింటికి వూడిపడ్డాడు. ఆ సమయానికి అటుగా వెళుతున్న హీరో ఇంట్లో లైట్లు వెలుగుతూండడంతో కంగారు పడి యింటికి వచ్చాడు. జగ్గయ్య అపోహ యింకా బలపడింది. ఇతడు అర్ధరాత్రి రావలసిన అవసరం ఏముంది? అనుకున్నాడు.

అనుకోవడమే కాదు, పైకి అన్నాడు కూడా. హీరోతో ముభావంగా వున్నాడు. ఇంతలో

సావిత్రి కథకు ఫస్ట్ ప్రైజు వచ్చింది. ఆ విషయం చెప్పబోతే జగ్గయ్య మండిపడ్డాడు. తను ఊళ్లో లేని సమయంలో హీరో తోటకు వెళ్లడం గురించి నిలదీశాడు. ఇదివరకు అతనంటే యిష్టపడని దానివి యిప్పుడింత చనువు పెరిగిందేమని అడిగాడు. సావిత్రి తనకు ఏ పాపం తెలియదంది. కానీ అతను వినలేదు. ఈ పాపపు బతుకు బతకడం కంటె చచ్చినా ఫర్వాలేదంటూ తోసేశాడు. ఆమెకు గాయం తగిలి రక్తం పోయింది. ఆరోగ్యం చెడింది. పలకరించడానికి వచ్చి హీరోతో ఆమె ముభావంగా మాట్లాడింది. సావిత్రికి తెలియకుండా జగ్గయ్య గుమ్మడిని రప్పించి పుట్టింటికి తీసుకుపొమ్మన్నాడు. మళ్లీ రావనక్కరలేదని ఆమెకు చెప్పాడు. నీ వస్తువులేవీ యిక్కడ వుండడానికి వీల్లేదు అన్నాడు జగ్గయ్య. ఇక్కడే వుండనీయండి. నేను పోయాక బీదసాదలకు పంచండి అందామె. వెళుతూ వెళుతూ సావిత్రి ఒక కోరిక కోరింది. నా ఆరోగ్యం బాగాలేదు. నాకేమైనా అయితే ఆఖరి చూపులకు రండి అని. సరే అన్నాడతను.

గర్భం ధరించాక సావిత్రికి బాగా జబ్బు చేసింది. పుట్టింటికి వేరే వూరికి వెళుతుంది కదా, అక్కడే కృష్ణకుమారి వుంటుంది. ఆమె దగ్గిరే ట్రీట్‌మెంట్. హీరో యిక్కణ్నుంచి డైరక్షన్స్ యిచ్చి, ఫారిన్ నుండి మందులు తెప్పించి వైద్యం పర్యవేక్షిస్తూ వుంటాడు. నవల ప్రకారం ఆమె వద్దకు వెళ్లాక సుధ అనే అమ్మాయి చక్రవర్తి చెల్లెలని సావిత్రికి తెలుస్తుంది. అప్పటిదాకా ఆమె అతని ప్రియురాలనుకుంటుంది. సుధ బతికివుందో పోయిందో కూడా ఆ లేడీ డాక్టర్ కృష్ణకుమారికి తెలియదు.

సావిత్రి వెళ్లిపోయాక జగ్గయ్య తాగుబోతవుతాడు. నవలలో అయితే వంటలక్క కూతుర్ని చేరదీస్తాడు. ఆమె ఓ రోజు నగలు తీసుకుని ప్రియుడితో సహా వుడాయిస్తుంది. సినిమాలో జగ్గయ్య పాత్రను మరీ అంత పతనం చెందినట్టు చూపలేదు. సూర్యకాంతం అతని యింటికి వంటకై వచ్చి చేరుతుంది. ఆమె కూతురు జయంతిని చూసి జగ్గయ్య పెళ్లి చేసుకుంటాననంటాడు. ఇనప్పెట్టె తాళాలు యిస్తాడు. జయంతి నగలు దిగేసుకుంటుంది. అంతలో ఆమె ప్రియుడు వస్తే అతనితో పారిపోతుంది. తర్వాత వారు పోలీసులకు పట్టుబడుతుంది. గుమ్మడి పోలీసు ఆఫీసరు కాబట్టి వాళ్లను శిక్షించబోతాడు. కానీ సావిత్రి వాళ్లను క్షమించేయమంటుంది.

సావిత్రి మానసికవ్యథతో ఆరోగ్యం పాడుచేసుకోవడం చూసి గుమ్మడి గట్టిగా అడిగాడు. విషయమంతా తెలిసింది. వెళ్లి జగ్గయ్యను తిట్టాడు. అప్పుడతను ఆకాశరామన్న ఉత్తరం బయటపెట్టాడు. అతను వెళ్లి హీరోకి చెప్పగా హీరో తన భార్యను నిలదీశాడు. ఆమె

చాలా పెళుసుగా సమాధానం చెప్పింది. నా కాపురాన్ని నిలబెట్టుకోవడానికి చేశానంది. దానికోసం ఇంకో కాపురం కూలుస్తావా అని తిట్టాడు. వచ్చి నిజం చెప్పు అన్నాడు. ఇంట్లోంచి బయటకు ఫో అన్నాడు. ఈ యిల్లు నాది అంది అతని భార్య. అయితే ఇల్లూ ఆస్తీ నువ్వే వుంచుకో అని హీరో వెళ్లిపోయాడు.



ఇంతలో బాగా తాగివున్న సమయంలో జగ్గయ్యకు తోచింది – భార్యపైనే కాదు, హీరోపై ప్రతీకారం తీర్చుకోవాలని ! అతను తుపాకీ తీసుకుని హీరో యింటికి వెళితే జానకి కనబడింది. నీ భర్త నా భార్యను చెడగొట్టాడు అని జగ్గయ్య అంటే నీ భార్యదే తప్పు, నా భర్తను వలలో వేసుకున్నది నీ భార్య, కావాలంటే యీ తుపాకీతో ఆమెను చంపు. భార్యను అదుపులో పెట్టుకోలేనివాడివి నువ్వొక జీవచ్ఛవానివి అందామె. ఇలా జానకి అతన్ని బాగా రెచ్చగొట్టడంతో జగ్గయ్య హీరోకోసం వెతికి చివరకు యిల్లు చేరాడు. ఈ సీను సినిమాలో కల్పించినది. నవలలో జగ్గయ్య హీరో తోటకు వెళ్లి దాన్ని నాశనం చేస్తాడు.

తీరా చూస్తే హీరోయే జగ్గయ్య యింటికి వచ్చాడు. అతని మాటల్లో పెట్టి తుపాకీ లాక్కుని కూర్చోబెట్టి తన ఉద్దేశాలన్నీ చెప్పాడు. అతని అనుమానాలన్నీ తీర్చాడు. ఆమె నా చెల్లెలు లాటిదని చెప్పాడు. సావిత్రి చావుబతుకుల్లో వుందని చెప్పాడు. జగ్గయ్యకు పశ్చాత్తాపం కలిగింది. వెంటనే గుమ్మడి వూరికి వెళ్లి భార్య వద్దకు వచ్చాడు. ఆపరేషన్ అవసరమని తెలిసి డాక్టర్ని ప్రాధేయపడ్డాడు. ఎవరికీ తెలియకుండా హీరో ఆపరేషన్ చేసి తల్లీ, బిడ్డలను కాపాడాడు. కృష్ణకుమారి అతని రహస్యం కాపాడింది. కానీ ఎవరికీ తెలియకుండా మళ్లీ ఫారిన్ వెళ్లిపోవడానికి నిశ్చయించుకున్నాడు. భార్యాభర్తలు ఏకమయ్యాక తనవల్ల మళ్లీ విడిపోతారన్న భయం అతనిది. తన భార్య ఎలాగూ పొమ్మనమన్నది.

కానీ యీ లోపున జానకి అన్న దేశాటన నుండి తిరిగి వచ్చి జరిగినది తెలుసుకుని చెల్లెల్ని తిట్టిపోశాడు. ఆమె క్షమాపణ చెప్పుకోవడానికి ఎయిర్‌పోర్టుకు వెళ్లింది. ఇటు కృష్ణకుమారి ద్వారా తన భార్యను కాపాడినది హీరోయే అని తెలిసి జగ్గయ్యకూడా ఎయిర్‌పోర్టుకు పరిగెట్టాడు. కానీ విమానం వెళ్లిపోయింది. కానీ హీరోకోసం తపిస్తూ సావిత్రి ఆరోగ్యం క్షీణించడంతో ఆ విమానాన్ని వెనక్కు రప్పించాడు గుమ్మడి. పోలీసు అధికారి కదా. అపోహలు తొలగిపోయి అందరూ కలిసారు. జగ్గయ్య తన కొడుక్కి చక్రవర్తి పేరు పెట్టడంతో సినిమా సుఖాంతం అయింది.

నవల కూడా యిలాగే ముగుస్తుంది. నవలలో చక్రవర్తి పాత్ర గురించి పాఠకుడికి వుండే సందిగ్ధం పాఠకుణ్ని ఆరాటానికి గురి చేస్తుంది. అతను తండ్రిని, భార్యను ఎవరినీ అదుపు చేయడు. ఒక నిస్సహాయ, విషాదాంత హీరోలా వుంటాడు. అలాగే సావిత్రి పాత్రలో అనేక సుగుణాలున్నా, ఆమె తనపై అపవాదు పడినప్పుడు ఫైట్ చేయకుండా పరిస్థితులకు తలవొగ్గడం వింతగా తోస్తుంది. చక్రవర్తి ఒక్కసారి పదిమంది ఎదుటా ఆమెను చెల్లెమ్మా అని పిలిచి వుంటే యింత కథ నడిచేది కాదు కదా అనిపిస్తుంది. సినిమాగా తీసినపుడు ఆ లోపాన్ని తెలియనీయకుండా మొదట్లోనే ప్రేక్షకుడికి, మధ్యలో సావిత్రికి రివీల్ చేసి టెంపో నిలబెట్టారు. నవలను సినిమాకు అనువుగా మార్చి రాసినది గొల్లపూడి మారుతీరావుగారు కాగా, అత్యంత ప్రతిభావంతంగా డైరక్ట్ చేసినది ఆదుర్తి సుబ్బారావు గారు. అన్నపూర్ణా సంస్థ వారి సినిమా కాబట్టి దుక్కిపాటి వారి ట్రీట్‌మెంట్ ఎలాగూ వుంటుంది. అక్కినేని, సావిత్రి, జగ్గయ్య, జానకి పోటీపడి నటించారు. మరపురాని సంగీతం అందించారు రాజేశ్వరరావుగారు. ఈ సినిమా హిట్ కావడంతో తర్వాత అనేక తెలుగు నవలలు సినిమాలుగా అనువదించబడ్డాయి.

ఇదీ డాక్టర్ చక్రవర్తి సినిమా అసలు కథ.

ఇంకొన్ని సినిమాల మూలాల గురించి ఈ పుస్తకం రెండవ భాగంలో పరామర్శిద్దాం.



